న్నంతయు గర్వము వారి ము
ఖాంతికము న్జేర దెట్టి యద్భుతులోకో!॥ 236
ఆ॥ ఈప్రపంచ మఖిల మిచ్చితినేనియు
నీడుకాదు వారి మేటికృతికి
శశికి నూలుపోగు చందంబుగా నే నొ
సంగుకొలఁదిఁ గాని సంతసింతు!॥ 237
క॥ అని క్రిందటిదినమునఁ దన
ఘనతురగము నెక్కి స్వారిగాఁ దిరిగినమే
రను సగ్రహారముగ ని
చ్చిన ఘనమ్మానను వ్రాలుఁ జేసినమీఁదన్॥ 238
క॥ ఆ నాఘనపుణ్యపుజమీం
దారగు శ్రీరామచంద్రధరణిపుఁ గని యీ
చేరువపాలెములోన
న్వీరికి వసతుల నొసంగ వీశ్పేయుఁడనన్॥ 239
సీ॥ అప్పుడే రామచంద్రపురాగ్రహార
మనుచుఁ దద్దత్తమునకుఁ బేరును ఘటించి
కాన్య వేదర్తుశశిజాడ మాన్య మైన
శాలివాహనశకపు వత్సరమునందు॥ (1640 క్రీ॥శ॥ 1719) 240
ఆ॥ మహితహేవిళంబిమాఘపూర్ణిమనాఁడు
బ్రాహ్మణద్వయంబు వ్రాయుమనిన
వారిపేర్లతోడ వ్రాయించెఁ బట్టాను
సకలజనులు మిగులసంతసింప॥ 241
క॥ ఈనైజా మెవ్వరొకో?
పై నీశ్రీరామచంద్రపార్థివు లెవరో
నా నెల్లచదువరులకు
న్నాన దెలియఁగవలయుకోర్కి మానసములలోన్॥ 242
క॥ నల్లిండ్ల నిలువుఘనుల మ
హోల్లాసముతో స్మరించుచుండుట హితమా
సల్లాపమె కావున ను
ద్యల్లీలవచింతుఁ గుతుకమంతయుఁ దీఱన్॥ 243
ఆ॥ కొండవీటి రెడ్లకుఁ జమూపతిగ స

దాశివయ్య యనెడిదక్షుఁ డొకఁడు
వారివగర పోర్ల వాసిఁ జేకూర్చుట
"న్యాసిరెడ్డి"బిరుదు ప్రాప్తమయ్యె॥ 244

ఆ॥ అతనికొడుకు మల్లికార్జునుండను రెడ్డి
నందిగామ శక్తినాధుకరుణ
వాసిరెడ్డివారి వంశకర్తగ మేలి
వృద్ధినొంది ప్రబలె వివిధగతుల॥ 245

సీ॥ ఆవంగడమున రామన్న రాఘవరెడ్డి
చంద్రమౌళియు నన్నసహజులొకట
ప్రతిభాఢ్యులై ఢిల్లిపాదుషా యౌరంగ
జేబ్బ్రకవర్తి విశేషకృపను
నందిగాం పరగణా నంది క్రీస్తుశకంబు
పదహారునెన్బదార్వత్సరమున
గోలకొండనవాబుచే లక్కరున మూడు
భాగాలఁ బట్టాలఁ బడసియుండి
రందు రాఘవపురము రామన్న కయ్యె
రాఘవయ్యకు మాగల్లు ప్రాప్తమయ్యె
లక్కరువవా బుఫ్జావిలక్షణుండు
శ్రీకుతుబ్షాహ వంశవిశిష్టతముఁడు॥ 246

క॥ స్వమతవ్యాప్తికిగా న
న్యమతధ్వంసంబు దీక్ష వతికతిసతకో
నమరెడి మహమ్మదీయుల ?
తమిం విప్రుల కగ్రహారదానం బిడుటల్॥ 247

క॥ అని యుమమానింపవలవ
దనువు దొరికినప్పుడెల్ల నర్చరు ఢిల్లీ
ఘనసార్వభౌముఁ డే మన
జనములతోఁ గూర్మి నేదిసలువఁగు నెమ్మిన్॥ 248

క॥ తొలఁగింపఁడె "జిజియా"యను
తలవన్నును లొక్క మెన్ని తలపెట్టఁడె బం
ధులగా నొనరించుకొనుట
నిలువఁడె గౌరవపదాల నిటి మనవారిన్॥ 249

చ॥ రాచరితంబునీతిఁ గనురాజులు సర్వసమానదృష్టి సం
కోచము వీడి చేకొనరొకో! యిభరాంపదవాచ్యుఁ డౌనవా
బే చతురత్వ మేర్పడ గ్రహింపడొకో కృతి నాంధ్రకావ్యము?
న్జూచిన నిట్టి వెన్నో పొడఁజూపునుజన్మ! మహమ్మదీయులన్॥

మ॥ మతము న్మచ్చర మేమొకో క్కరికో సంప్రాప్తించు నద్దానఁ గ్రూ
రత చిత్తంబుల నిండు గుర్భరకఠోరస్వార్థకృత్యంబు లు
ద్ధతి రేఁగు న్గది రాజ్యమే జిత్రమువ లౌనౌరంగజేబ్బకీవ
త్రితల న్బట్టిరె యీదృశం బగుమహారిష్టప్రదౌద్ధత్యమున్?॥ 251

ఉ॥ ఆతనికాలమందె తుదికాంకముగందు స్వతంత్రు లైనభూ
నేతలలోన మిక్కిలిగ నేర్పరి యైనయుసఫ్జనామవి
ఖ్యాతుఁడు క్రొత్తగాఁ దనకుఁ గల్గినస్వేచ్ఛ స్థిరంబుగాఁగ నై
జాతతసర్వసామ్యత దయార్ద్రిత నాచరణంబునం దిడెన్॥ 252

గీ॥ అట్టుల నిజాము రామచంద్రన్న లోసఁగు
కచ్చెలలు ముప్పదిటి కారుఁగూర్చి రాఘ
వన్న మునిమ్మనఁడైన జగ్గన్నగారు
వృద్ధి స్థిరపర్చి రగ్రహారీయుభూమి॥ 252

ఆ॥ మొట్టమొదటి దానమునకుఁ బదారేండ్ల
కివల మఱల సన దదేటి కనుచుఁ
దోఁచవచ్చుఁ గలదు దొడ్డకారణ మొండు
తెలియ దానపత్రములను జదువ॥ 254

సీ॥ రామచంద్రా(లింగా)రెడ్డి నామమే నెండవ
పత్రంబులో నగుపడక వారి
పిన్నముత్తాతగా నెన్నంగఁబడు రాఘ
వన్నయుఁ దత్పుత్త్రుఁ డైనపద్మ
నాభరెడ్డియు వారి నందనుం డైన నా
గన్న తత్పుత్రుఁడు జగ్గన్నగారు
నుదహరింపఁగఁబడి యుంటచే రాఘవ
పురజమీ నేహేతువునొ విడిగ
నిలక మాగంటిలోపల న్గలసియుంట
కానఁబడియెడు రామలింగన్నగారు
సుతులులేమి జగ్గన్నఁ బెంచుకొని రందు

రగుటఁ దొలిదాన మిటు ధ్రువం బందవలసె॥ 255

గీ॥ వేదగుణగిరిశశిసంఖ్య (1784) వెలయుహూణ
శకమున జ్జిత్రభానువత్సరము నాశ్వ
యుజము పూర్ణిమనాఁడు ధ్రువోక్తిఁ బడసి
రామచంద్రపురాగ్రహారంబు వెలసె॥ 256

క॥ ముందుగ గుంటూరె వెలసెనొ?
మందే యీయగ్రహారమో? తెలియంగా
సందిడవు చరిత్రలు మన
కెందులకొకొ వట్టియూహ లిదమిద్ధమనన్॥ 257

క॥ రాజులకు ప్రాజ్ఞుల కు
ద్రాజ ద్ర్పవిశద్ప్రభంజనార్భటి రేఁగం
గాఁ జెదిరి యొక్కవిప్రవ
రాజం బివ్వనిని నిలిచి మలయుచ్చలయున్॥ 258

క॥ అది యెట్టు లుద్భవిల్లినఁ
బదివందలవత్సరములపైగఁ జరితల
న్విదిత మ్మగుగుంటురుతో
నిదియు న్విసఁబడుచునుండు నెదుగుబోదుగులన్॥ 259

మ॥ ఒకరాజ్యచ్యుతి వేఱురాజ్య ముదయం బొందించునప్డెల్ల నా
త్మకకుప్పాలకుఁ ద్రొక్తయాపులఁ బురాదత్తసిరీకారము
ల్ప్రకటా లయ్యెడు లేవఁ జిన్నదగు నీనాలంబు మున్నెన్నియె
న్నికరాల న్బడిమాఱెనో యెఱుఁగ మానిగ్గేచరిత్రంబులన్॥ 260

—: అగ్రహార వర్ణనము :—

చ॥ వఁసల నారితీఱియుఁ బ్రవాస మొనర్పఁగ దక్షులొట నిం
దుల ప్రజలో నమాయికజనుం డొకఁడేనియు లేఁడు రాజకా
ర్యలలితుల న్నెపుల్పని నిరక్షరకుక్షియు లేఁడుసంఘము
న్బలమె బలంబటం చనిని వాఁడును లేఁ డవు డెట్లుచూచినన్॥ 261

క॥ ఒడుదుడుకు లెన్నియున్న
న్గడనకునై మతములిధులు కడగా నందొ
క్కఁడుఁగూడ వేషభాషలఁ
బడఁ డనఁమ తెక మోహావర్యాకులుఁడై॥ 262

గీ॥ రచ్చ కేగెడునప్పుడే రాజనియమి
తం బయిన వేషమును భాష తత్ప్రదేశ
మందయిన నాత్మయోగ్యత స్గుండురాని
పోబడిన భూమిసురు లప్డు పూనుకొనిరి॥ 263

సీ॥ గోష్పాదము వఱకు నెక్కుడుగాని శిఖ నిండు
వెన్నెలల విభూతి పెండెకట్లు
కోడెత్రాఁచువఱకు నెక్కుడు తెల్ల జందెంబు
కావిధోవతి పింజకట్టు మట్టు
రంగు మాఱని మేల్గాంపు గెనసేలువ
లంకెప్రాణంబు కోల్లాయిగుడ్డ
గతనాలపొడుపుతో రాణించుకుండలా
లఱుతి నటించు రుద్రాక్షమాల
నడుమున నొంగిచూచెడి పొడుగాటి కాయ
నోటఁ ద్రిస్వరః గమవాక్పాటవంబు
బ్రహ్మవర్చస్క పరమప్రభాప్రసక్తి
వెడలుదురు రచ్చకేగ నవ్విప్రు లందు॥ 264

సీ॥ సరి నుషఃకాలాన శయనంబు విడి కాల్య
కృత్యంబులెల్ల నెగ్గించి పిదపఁ
దొలిగాడ్పుసోకు లందుకొను తేటనీట
సంకల్ప మొనరించి స్నానమాడి
ప్రాహ్ణసంధ్యావందనాభియుక్తి దివాక
రార్ఘ్యంబుల స్భక్తి నప్పగించి
నిష్ఠాగరిష్ఠత న్నిలిచి జప మొనర్చి
యాసక్తి హోమంబు నాచరించి
దేవతార్చనమును శ్రద్ధతేటఁ దీర్చి
యతిథియభ్యాగతులఁ దేర్చి యాదరించి
వైశ్వదేవంబుఁ గావించి బ్రహ్మయజ్ఞ
తత్పరుం డగు నచటి నిత్యవ్రతుండు॥ 265

సీ॥ పదముఁ గ్రమం బొక్క వైపు ప్రోగుచునుండ
జట ఘన యొకపెడఁ "ఝుయ్" మనును
గావ్యపాఠం బొక్కకడఁ జెలంగుచునుండ

నాటకాధ్యయనము నడచు నొకట
వ్యాకరణంబున వ్వాద మొక్కెడ సాగ
మీమాంస యొక్కచో మెలఁగు మిగుల
దర్క మొక్కొకట నుద్ఘాటితం బగుచుండ
వేదాంత మొక్కెడ వ్వెల్లివిరియు
నొకట హరికథ చెలరేఁగ నొక్కయెడఁ బు
రాణ మత్యంతరసయుక్తిఁ గ్రాలు నహహా!
అట సరస్వతి వివిధనాట్యప్రవృత్తి
వెలయు మైమఱపున హాయి నొలయునట్లు॥ 266

క॥ మేనాల నెక్కువారును
పూనిక భూతముల నెక్కిపోయెడివా ర్వో
గానని చనియెడు వారుం
గా నానాప్రజ్ఞల ప్రబగల్భులు విప్రుల్॥ 267

క॥ రాజాస్థానం బెఱుఁగని
వాజన్నలు మందునకును వఱల రచట నే
రోజ విచారించిన నీ
రాజితబహుశాస్త్రగుణధురంధరులగుటన్॥ 268

సీ॥ ఉండిన స్స్మృత లేకున్న నే స్పశువులు
గట్టుఁ దాఁటవు నెందుఁ గట్టఁబడవు
నిండిన నగడు పింత నిండకున్నను శుని
వెలిచోటు వదలి లోపలికి రాదు
దొరికిన న్స్వతు కేడ దొఱుక కుండినఁ గాకి
మదురుల న్వీడి గుమ్మములఁ జొరదు;
అబ్బిన న్మాక ను చ్ఛబ్బకున్నను జీమ
పుట్టల న్వీడి గృహంబునఁ దిగఁగదు
తఱిఁ దలఁగనీక తత్తదుత్సవముగాఁగ
బహువిధాహారములు సమర్పణము జేయు
సర్వసమవర్తు లగువిప్రసమితి శోభఁ
బ్రౌఢిఁ గాంచు తదగ్రహారంబునందు॥ 269

సీ॥ మానూరివారి సంస్థానాన వివిధస
న్మానానఁ గొందఱు మహిమఁ గొనఁగ

మహ్రాజువారి సమ్మర్ద మాడేవిడి
స్మర్యాదఁ గొందఱు మంతుఁ గొనఁగ
వాసిరెడ్డి ప్రభుత్వవైకుంఠసుఖపార
వశ్యానఁ గొంద ఱుద్భటతఁ గొనఁగ
మొనసి మూడాస్థానముల సమాదృతి నొంది
కొందఱు భాగ్యంబు గుత్త గొనఁగ
నచటివారల కిది యున్న దద్ది కల్ల
దనెడి యేలోటుపాటు నెం దొపరకుండ
నిట్టినిందున నీసుగో సేమి లేని
గట్టియనోన్యభావంబు గ్రాలి ప్రబల॥ 270
సీ॥ గుజరాతు నైజాంకకుబ్భాగముల వీడి
వగ నొగ ద్దర్లు భోసగిరివారు,
హైదరాబాద్పుమీాపాపని న్వ్యజియించి
సాగి వచ్చిన కొలచలమవారు,
దాక్షిణాత్యుల మహోద్ధతి కోడి సుఖసీమ
ప్రాలఁ జేరిన రావిప్రోలువారు,
పటుమరాటీపదార్భటి నొత్తిడిం జెంది
లాఁతి చోట్లరయు వెల్లంకివారు,
వారుపీ రననేల నావల్లెయుండు
వసతి నివసించు గుండువా ర్వారణాసి
వారు మొదలగు తెలుగాణి వారలెల్లఁ
గోరి మహదాశ్రయము నందుఁ జేరినట్లు॥ 271
గీ॥ అలమహారాష్ట్రు లధిపతు లైచెలంగ
గౌరవోద్యోగముల నున్న వారు మధ్య
లందు స్థిరులైరి పిమ్మ టఁగొంద ఱద్ద
నూరి జాడిద మొదలైనవార లెలమి॥ 272
క॥ శ్రీరామానుజ గురుమత
చారక రాజాను భూతిసామర్థ్యమునన్
జేరిరి కొందఱు వైష్ణవు
లారమ్యం బైనపల్లియ న్నుతుకమునన్॥ 273
గీ॥ ధీయలేకాళ మిగులనుదారు లైన

వరజమీందార్లకడ మంత్రిపట్టమూను
వారిపాంగ్యాన నియోగి వరులు లక్ష-
రాజు మొదలగు వా రందు మొజాఁ గొనిరి॥ 274

ఉ॥ రెండవయుద్ధపట్టుగ వరించి విలాసగృహాళి కోటల
నుండిగ గుంటురందు బహుధా విరచించు జమీనుదార్ల పే
రందఁ జెలంగు నంఘ్రిభవు లందొకకొందఱు స్వాస్థ్యమొంది రా
దండలఁ బల్లె పెద్దయి తామరతంపరగాఁ బ్రవర్ధిలన్॥ 275

క॥ ఈపల్లెయు గుంటురు నిలు
తీపొందుచునుండ జనులకెల్ల జలము లె
ట్లాపూర్తిఁ గూర్పనగునని
భూపులుఁ బ్రజ సంప్రతించి పూనిసి వేళన్॥ 276

గీ॥ హూణగిరినిగమాబ్దెందునయుక్తవత్స (1147)
రమున భీమనపేరొలగఁమున సంధి
విగ్రహాద్యధికారియై పేరుగనిన
సోమనామాత్యుఁ డేకుదెంచుట ఘటిల్లె॥ 27

ఉ॥ ఉన్నపరిస్థితుల్ని కృపోదధి స్థానికమైనయుద్యమం
బు న్నిగిడించి పాటుపడి భూపతి నుత్సుకఁజేసి కూరిచెఱ
వు న్నట నున్నదొర్వలను భూరితటాకములై సమస్తసౌ
ఖ్యోన్నతి నిచ్చుసారజలయుక్తము లొవకుస ప్రసిద్ధతన్॥ 278

గీ॥ పల్లచెర్వగ్రహారంబునకు యమూళ
నెసఁగు గుంటురుపశ్చిమా నెట్టిచెఱవు
వీనిమధ్యమున నూనువృద్ధి వెలసె
వీధు లంగళ్ళు నల్లిళ్ళు పేట లెన్నొ॥ 279

క॥ ఈ రీతి నెదుగుచుండ ధ
రారమణులు భోగపరపరంపరులై త్యా
గారంభు లగుట నంగల
వీరుల కైవసములయ్యె వీండ్లినేలన్॥ 280

—♦ బ్రాహ్మణ వృత్తి పరివర్తనము ♦—

ఉ॥ లౌక్యమహాకలాపకలన న్గడునేర్పరులైనయుంగలు
లౌక్యము కల్గఁజేసుకొని శూరతఁ బెంచెడి శస్త్రధారణా
ధిక్యత సంయమించి వెలితి న్బడఁబోవని శాంతిసౌఖ్యము

ల్పకల్పము లౌనటు లెక్కడుఁ బ్రశస్తముగా నల నేలుచుండుటన్॥ 281

మ॥ కృషి వాణిజ్యముఁ గారుకాల లనురక్తిన్ సేవ సంపాదనన్
దృఢ ప్రోత్సాహ మొనర్ప యోగికపురంధి న్నొంది గ్రామస్థితు
ల్వివరముల్గా ద్యజియించి పట్టణము లన్వేషించుచు న్జను ది
క్కుపణశ్రీజనతాప్రవాహయుతముల్గా నాదినా లొప్పఁగన్॥ 282

గీ॥ అగ్రహారాలుకూడ బ్రహ్మణులెగాక
వివిధజాతిమనుష్యుల న్నెలకొనఁ దొడఁగఁ
గ్రమముగాఁ బూర్వవృత్తి విప్రత్వమును నొంద
విప్రులు న్బహువృత్తినివిష్టు లైరి॥ 283

సీ॥ మేనాలు రథ్యల న్మెకొంట దిగనాడి
పంచ మేడలఁ బవ్వళించె నెక్కు.
పాండితీవాదము ల్పెలుసభ లొప్పెఱ నోడి
యన్యోన్యభేదవైన్యతఁ దక్కు,
శౌచసదాచారపరవిధానము
లక్కడుఁ గుళంకల తిగుకుములఁ జిక్కు.
స్నానాగ్నిహోత్రజపానూననిత్యక
ర్మము లొత్తిగిల్లి జీర్ణతను స్రుక్కు,
ననుదినాగమఘోష బిట్టడఁగె నుదర
పోషణమునకుఁగాఁగ నింగ్లీషు వెలయు,
నేటుగ స్వచ్ఛ మగు బ్రాహ్మణికమె యప్పు
డగ్రహారంబులన యుపహాస్య మొందె॥ 284

చ॥ వరుస నిషిద్ధకాకములె ప్రాశనకు న్బరిపాటులయ్యెఁ బే
ర్చెలఁచు నిషిద్ధవృత్తులె మతిస్మృతి నయ్యె విధాయకంబు, లే
మఱియు స్మరింపరాని కసుమాలపువాక్కులలోన నెక్కు నె
న్బకువుఁ బ్రతిష్ట లాదిఁ బుగ్రాహ్మణులందయిన న్గ్రిమంబునన్॥ 285

గీ॥ లవణములకో స్వదేశభూధవులు వైదొ
లంగిరి ధరించువారలు చెలంగరైరి
పంచకళ్యాణియు న్నార్థంబు నొక్క
గాట మెలఁగంగవలసె నకాలమందు॥ 286

క॥ పాలకు లన్యమతస్థులు
పాలితులే స్బహుమతాలవా రగుట న్ద

శ్వేలకపాలితులకు రాఁ
జాలున సమరసవిధంబు సరి నొకమాత్రన్॥ 287

ఆ॥ మతవిరుద్ధకృతుల మప్పఁజూచుటచేత
సేన తిరుగుఁబాటు సేయఁ దెలిసి
పాలనంబుఁ గొనుచు భవ్యవిక్టోరియా
మాత యాజ్ఞ జేసె మతసహనము॥ 288

క॥ ఆశాసనంబు చాటున
దేశంబున గలమహామ్మదీయులు నార్య
ల్నాశంకరవిషమదురా
వేశంబుల మాని మనఁగ వీ ల్పొసఁగుటయున్॥ 289

క॥ నానాఁటికి సంఘదురభి
మానంబు లణంగ నెవరిమతములలో వా
రూనఁదొడంగిరి స్వేచ్ఛా
మానితసంస్కరణములను మంచి వటంచున్॥ 290

క॥ మతవిద్రోహులపై నే
మతాధిపుఁడుగాని యాంత్ర మానవలసెఁ ద
త్కృతి మానవష్టకరమను
మతిఁ దీర్పులు న్యాయసభల మాన్యము లగుటన్॥ 291

క॥ దేశీయు లైననృపు లా
దేశంబుల గౌరవించి తేర్చుట పోవం
గా శబలితమతమఠరా
డాశయములు నలిగి తొలఁగె నంతరువాతన్॥ 292

ఆ॥ తగినరక్ష లేమి త్వరలోనె మతసాంప్ర
దాయములు కలంగి మాయమయ్యె
డెప్పర మగుమిడిమిడిజ్ఞాన మెగయుంగఁ
గ్రమతఁ గుమతపరతఁ గనిరి జనులు॥ 293

క॥ ప్రాతస్సాయాహ్నంబుల
నాతతభక్తిప్రవత్తి నాలయదేవ
వ్రాతములఁ గొల్చుపద్ధతి
ప్రాఁతగిలి నశింపఁ దొడఁగె పటువేగముగన్॥ 294

శా॥ విప్రస్వాములఁగూడఁ జూడఁ గ్రమత న్విధ్యుక్తకాలార్చనల్

క్షిప్రంబు ల్గళితంబు లౌచుఁజనసాగె న్విగ్రహాదు ల్కళా
తిప్రౌఢి న్భువనేశ్వరాంతరముల న్దీపించుట ల్మాని యే
దోఁప్రక్క న్బడి వట్టిషుబ్జ్మలయి సందుంగొందుల న్వర్తిలెన్॥ 295
శా॥ మైలల్ గ్లుప్తసమర్చ ముప్పాలను ముంప న్మాన్ను దక్షంబు లౌ
సాలగ్రామము లైనఁ ద్రాసులను దూఁచ న్దూకవున్నాళ్ళుగా
గాలి న్లైచెడికాగితా ల్నిలుపురాల్గాఁ దేలియు న్జాల వే
మూలం దెట్టియవాయుముం గొలుప నిర్ముక్తప్రభావంబులన్॥ 296
మ॥ యుగధర్మానుగుణంబు స్వాశ్రమవిధు ల్త్యగ్రస్థితి న్సల్పువా
రగడు ల్పొందుచు నేకొలందిగనొ యుందం దుండఁగా సర్వవ
ర్ణగతు ల్మిక్కిలిగా దురాచరణ దుష్ప్రారంభులయ్యు న్గదు
న్నగము ల్కాంచునటు ల్చెలంగెదరు గచ్ఛ్రలేఁగ గుంటూరునన్॥

—గ్రంథకర్తృవంశాదికములు—

కం॥ ఆపురి న్రామచంద్రపురాగ్రహార
గతశివాలయవీథిలోఁ గాపురంబు
గాఁ బురాతనవిప్రసంఘంబు లనఁగ
నిలుచుఁ బలువంశములు కీర్తనీయగతుల॥ 298
క॥ ఇంగువగట్టిన గుడ్డ ల
నంగాఁ బ్రాగ్గౌరవంబున న్నూత్నకళా
భంగిమ ప్రత్యేకతఁ గూ
ర్పం గాలము గడపుకొంద్రు బహుశేముషులన్॥ 299
ఉ॥ వారలలోన భోనగిరివంశ మనాదిగ లౌక్యవైదికా
ధారసుధీనిదానమన దక్షతతో నుతికెక్కె మేల్జమీం
దారులు గౌరవించి గణన న్మడిమాన్యము లీయఁ గాలికా
చారముల న్వసించు నట సంఘసమాదృతికి న్సమర్హతన్॥ 300
సీ॥ రాయపాధ్వరికిఁ బుత్త్రద్వితయం బందుఁ
బ్రథముండు పట్టాభిరామసోమ
యాజి ప్రజ్ఞావంతుఁడై యమరావతీ
శ్వరుకొల్వున న్దురంధరతఁ గాంచె
ననుజుండు పరిదేశియుజ్య గృహక్షేత్ర
యాజమాన్యమున మాన్యతను నిలువ,
వేదవేదాంగసంవిన్మణిఁ లిర్వురు

న్నిరిసంపదల యశస్స్ఫురణ మనుచుం
బుత్రపౌత్రులం గాంచి రిర్వురును వరుసం
బ్రేమం బెదతాత పేరునే పెద్దమనుమ
లిర్వురకుం బెద్ద లిడ వీర లెసక మెసంగ
శాస్త్రియును సోమయాజిగా సౌరుం గనిరి॥ 301

వ॥ పట్టాభిరామ సోమయాజికి శివరాముడు, మంగయ్యయను సుతులైరి సంతుంగాంచని శివరామునకు మంగన్న మూవురు సుతులలో మొదటివాఁడగు పట్టాభిరామశాస్త్రిని దత్తిచ్చుట గలిగె॥ 302

క॥ పరిదేశిపాత్రుఁడు న్న
ల్వురుసుతుల న్గాంచి చివరి పుత్త్రు విజయరా
ము రహిని బెరతాత మనుమ
ని రాజ్యమునకు దత్తుగా గణించి యొసంగెన్॥ 303

ఉ॥ తారణ మాఘపూర్ణిమ సితగ్రహవారము ప్రొద్దుపొడ్పులో
ధారుణి నొందె నీతఁ డవతారముఁ, బుష్యఁ దృతీయపాదము
న్నీరజవైరి దాఁటుతఱి, సిద్ధవుఁజక్కఁదనంబు పొల్పునా
కారము మేనికెంపురుచి కన్గొనువారిఁ దమి న్దనర్పఁగన్ 304

చ॥ మకరము లగ్న. మబ్జహితమంగళయుక్తము, సప్తమంబు శీ
తకరసమేత, మష్టమము దైవగురుస్థితికంబు సూర్యపు
త్త్రికయుత మై దిరా ర్సితబుధప్రబలంబును. మూఁడు కేతుకో
రకితముగాఁ దగె న్విజయరాముని జన్మము శోభనాఢ్యమై॥ 305

మ॥ శనిద్రేక్కాణముఁ జంద్రహోరను నవాంశ న్ద్వాదశాంశ న్ధరాం
శుని గన్యాబుధు నింద్లు మీనగురుగిము న్మౌళిత్రింశాంశ నొం
దినలగ్నంబునఁ గోణకేంద్రపుఁబు పంద్రెండింటఁ జేర న్బదేం
డ్లిససంజాతు దశావశేష మమర న్వావాకత న్బుట్టినన్॥ 306

మ॥ కుజుఁ డుచ్చ న్గలఁ డర్కనూనుఁడు నెసంగు స్పంచమంబంమఁ బై
ని జయోద్భాసి గురుండు క్షేత్రపదము న్వీక్షించు నెన్నంగ న
క్కజ మె ట్లాస్తిని బెంపు కల్గునొకో మార్గం బెద్దియో? దత్తుకాఁ
గఁ జన న్యోగమునున్న దం చనుకొనంగా వార్తకొన్నాళ్లకున్॥ 307

గీ॥ తెలిసి పట్టాభిరామశాస్త్రి యురుదెంచి
"యౌర! పట్టాభిరామసోమన్న! అన్న!
పెద్దతాతయ్యకిదుటి యాపద్దశ న్వ

చింపనేటికి కడుఁ బరిచితమకాదె॥ 308

శా॥ ఆస్థానంబులఁ బండితోత్తములయం దయ్యుత్తమశ్లోకది
వ్యస్థానాస్తిని బెక్కుగ్రామములమాన్యంబు లనూర్జించి మే
లాస్థ న్నిష్యుల బంధుల న్నిత్రుల నత్యంతంబుఁ బోషించి కీ
ర్తిస్థైర్యంబునఁ బెద్దతాత కొనెఁగాదే కీర్తికాయత్వమున్॥ 309

ఉ॥ మంగయశాస్త్రి యాయనకుమారుఁడు నాపితరుండు సాహితి
న్నింగము మైన నంగలులు చేసినమేరల కెల్లరాజ్యము
ల్భంగములై చన న్నృపుల ప్రాపు నశింప గడింపు వోయిన
న్వంగని సత్యసత్రమున బద్ధుఁడు గాఁడె మహాఋణంబులన్॥ 310

క॥ తన ముగురాత్మజులమునే
నను నాసోదరులు నదిగి నూల్కొని యేకొం
తనో తెచ్చుమండఁగదె యిం
టిని యాఁకలిపుల్ చొఱ స్సతింపక యుండన్॥ 311

మ॥ తల దాకట్టిడినట్టు లాఋణముల న్నైర్మ్యంబునో మాన్యము
ల్తలము ల్వే తెగనమ్మి తీర్చి ఋణము క్తత్వంబుఁ బ్రాపించి యి
ట్టులా కాలంబును దాఁటు మా కిపుడు గడ్డుంజిక్కు లొక్కమ్మది
వ్గలఁగింప న్నమకట్టి నెట్టుకొని, యన్నా! ప్రాప్త మేనాఁటిదో?॥ 312

సీ॥ పరదేశి-పెదతమ్ముఁ-డురుశాస్త్రాభ్యాసి-
చనె- గవర్నర్మెన్ఁ జాల దాఁప!
వెజ్జవిజ్యుఁడు నాత్మవేది సీతారాముఁ
డరిగె నాచినతమ్ముఁ డడలుఁ గొలిపి!,
తరియింతు నాపెదతమ్మ సిబ్బల నంచు
నెంచ నిర్వు రొమ్మసగించి యేగి!
రయ్యో! యేమని చెప్ప ననపత్యులము నేను
నాయాలు, గడచు దినంబు లెట్టు?
లెవరి, జూపెట్టుకొని గడియింతు మనుదు?
నెటులు విధవల మఱదండ్ర నెపుడుఁగాంతు?
నాన్న తరువాత నీవె నా నాన్న వన్న!
తలఁపుమీ! నాదువంశంబు నిలుప నన్న!॥ 313

చ॥ మఱదలు బిడ్డఁజూచి నను మాటికిమాటికి బ్రోత్సహించెడి

న్దొర! జగముద్దుబాలుఁడు పదుండు పదుం డడుగుం! డటంచు నా
తురపడ నేటికం చెటులొ త్రోసితి నేఁడులుమూఁడు, నాభుజాం
తరమున నే మెలంగు బుడుతం, డయిన న్గనఁదృప్తినుంతయున్"॥ 814

క॥ అన, ననునయించి యనె మ
జ్జనకపితయుఁ డెఱుఁగనటర? జరిగినదెల్లన్!
మన కొకభేదముఁ గలదే?
యనుమానంబేల? నీకె యుగు వాఁ డెలమిన్॥ 815

ఉ॥ ఏదురదృష్టమో! వరుస నిట్లు గనొక్కరివెంట నొక్కరుం
గాఁ దెగినారు సోదరులుఁ గందులు! బిడ్డ నొసంగుపూన్కికి
న్నా దొక తెంపు, రోజులుచనంజన దుర్గ్రహబాధ పోవగుం
గాదె! యటన్న యూసఁ దమకం బడఁగింపుము మేలు సేకుఱున్॥ 816

చ॥ మనసు చివుక్కుమం చనెనొ మాటదియు న్వచియింప కింటికే
గిన నెలలోనె మేను పులకించి యుపాధ్యపురోగ ముద్భవి
ల్లిన నొకకొన్నినాళు లెటులే జరుగన్ స్మృతిపోవుముంపు పై
కొనునటులుండ నాదుజనకు న్బిలిపించి జలార్ద్రచక్షుఁడై॥ 817

శా॥ "అన్నా! బత్తెము నాకు భూమిపయి శూన్యం బైనయట్లున్న దె
ట్లున్న న్బాలుసపైని భ్రాంతి నుసు రుద్యోగింప దుఃక్రాంతికి
న్ని న్బ్రార్థించెద దత్తహోమవిధి కానీ! కాకపోనిమ్ము! నీ
వన్న ట్లర్భకు నాదువంశమున కీయ న్నేల్కయి న్వేయుమా!॥ 818

మ॥ విధియుక్తంబుగఁ దంతు సల్పవియెడ న్వేఁడైనను న్నిల్పు, మే
ల్పధము ల్నాకు లభింపనీ చెడి లభింప న్నానిన న్నానని
మ్ము, ధర న్వంశము నిల్పు, నయ్యదియు నీపుణ్యంబగు న్మేదిని
న్బృథ చేకూఱుఁ గృతార్థత న్విడిచెద న్బ్రాణంబు లేనైననున్॥

మ॥ అని కైజంటను జాపి కన్గొలఁకులం దశ్రు ల్జడి న్బాఱఁ జూ
చినఁ దా మజ్జనకుండుఁ గంటితడి యుంచె ల్కట్ట హాస్తద్వయం
బునఁ జేతులొక్కని "తమ్ముఁడా! మును పె నీపుత్త్రిం డెవాఁ డంటేఁ గా
దె! నిజం బియ్యది నమ్ము మమ్మలునకున్ దృప్తిన్నది న్గొల్పుమా!"

చ॥ అనుచును బాసనీయఁ దుష్టితాత్మకుఁడై యతఁడేగె సర్వధా
రి నధిక చైత్రమాసమునఁ గృష్ణచతుర్దశినాఁడు మూఁడువా
యునము లెసింది నాఁకు డనంతరమం దొకకొన్ని యేండ్లుపో
యినపిదప న్ననుఁ న్వ్యధగ నీ ఁదలచుచు నున్నయంతటన్॥ 822

క॥ ఆపాదమస్తకాంతం
బేపెడనే న్నాదిమోపనీయునితఁడుచు
న్గోపున మఱుఁగాచికము కడు
నేపున నన్నాక్రమించె నేడవయేటన్॥ 323

ఉ॥ అమ్మయుఁ బెంపుడమ్మ కడునాతురత న్గొని యారుమాసము
లమ్మహరమైనవ్యాధిఁ బడి మూసినకన్నుఁ గంగ లేనిన
న్నమ్మలికంబుఁ బ్రేమమును నొత్తిడిఁ గొల్పఁగఁ బథ్యపానమా
ర్గమ్ములఁ జక్కఁ దిద్ది యొసకంబు ఘటించిరి నాకు నెమ్మితోన్॥ 324

క॥ పదునెనిమిదివందలతో
బదియొదవయేట జూను పదునాల్గున స
మ్మదసంభృతార్వజనయు
క్తిద తృహోనంబు వదుగు దీప్తి ఘటిల్లెన్॥ 325

ఆ॥ ఐనదనినమాట కాని పెక్కుదినాలు
మాన జనకజననితోనె నిలుట
నా నిసర్గబంధ మంతంత్రవీలునే
యుంటు గట్టువెంట నగున త్రెంప॥ 3?6

ఉ॥ మందు దశావశేష మతిమందముగాఁ జనునవ్వు బుద్ధిలో
మందముతో గ్రహింప జడియుంబును బైకొన మూఢవృత్తి నా
యం దతిమాత్రమై వెలసె నర్కసుతుం డయిదింటనుండి రెం
టిం దిలకించుచుంట వికటించు గ్రహస్థితి దాఁట శక్యమే?॥ 327

గీ॥ నవదశాప్రాప్తి నవదశానాథయోగ
శక్తిచే నవననమైనశక్తి తెనర
నవపుఁ డగుపోమునినుతుండు నా కొసంగె
నవనవోన్మేషబుద్ధి నానాఁటి కెనుగ॥ 3 8

శా॥ కావ్యం జేర దివౌకసేజ్యశుభవీక్ష స్వర్గృహంబై కనన్
స్తవ్యం బైనధనస్సున న్బుధియుఁ బెంట న్గెల్చుట న్పెమ్ముఁ డ
ర్హావ్యాసృత్తము గాదె పూర్వ మెటో సంప్రాప్తంబులుంగా వె మం
తవ్యశ్రీకరమంగళోద్యతనము ల్గామై ఫలాలీయుచున్॥ 329

సీ॥ ఒక్కయేడైన నెం దోటమిం గనకుండఁ
బట్టభద్రత నాంగ్లవాణిఁ గలిగె
జెండవఘాంబు నుండియే గణములె

న్నది ప్రబంధోక్తి సంధించు టమరె
నవుడె సాంసారికవ్యవహారములు పైనిఁ
బడ నాస్తి సేమ మేర్పఱచు టొనరె
నానాఁడె పెండ్లాడ నలనాఁటిగవఫార
మందె సంతానాప్తి కయ్యె మొదలు
ఆర్జనము దెచ్చునుద్యోగ మందనయ్యె
ఋణముల నీర్చి నిలవఁ జేర్చికొనఁ బొసఁగెఁ
బ్రథమ మైనకన్యాదానఫల మెసంగె
బుధదశాబ్దంబు లం దిట్లు పొసఁగె వృద్ధి॥ 380

శా॥ ఓనామాల్మొదలెత్తునాఁటికె పదేండ్లొప్పె న్భళా! యెట్టిప్ర
జానిష్ణాతుఁడొ మందుఁ డాబుధదశన్ షష్ఠాష్టమత్వంబున
న్నొప్పెనీఁడయ్యె పదేండ్లు మాంద్యమును బంగుం దాఁడి నెక్కించుచం
దాన న్నాల్గవఫార మెక్కుటయె గండంబయ్యెఁ గుంటున్నదన్॥ 381

శా॥ మందజ్ఞప్రథనంబునం దుభయసంబంధంబు తగ్గెచ్చుల
జ్జైందజ్జైంద సదేకమాన జడతాజిజ్ఞాతృత ల్లొచ్చుహె
చ్చుం దాల్పన్ గెలుపుంబతాక బుధుఁడెచ్చోఁ గొల్పె! జ్యోతిర్బలా
ప్తిం దూపింతురు కొంద తేమనఁదగు న్విద్యావివేకజ్ఞతల్॥ 382

శా॥ ఆకాలంబున నాస్థితి న్దడవ నౌరా! వింతలన్వింతగా
నాకే తోఁచెడి క్లాను నొక్కటియు పూర్ణప్రౌఢి రాకే యెటో
ప్రాక న్దేకితి మూఁడు ఫారముల పర్యంతంబు! పైనిన్నియే
దాఁకెన్ బహుమానము ల్పడయుసత్త న్గంటె నవ్వాయిగన్॥ 383

ఉ॥ షష్టనవాధిపత్యము! దశస్థలరా జగుశుక్రుపొందుఁ! ద్వై
విష్టవమంత్రి చూపు! వ్యయవేశ్మపదాప్తి! బుధుండు! యోగము
త్కృష్టత నీక మానునె సుతృప్తిగ? నన్నివిధాల నిచ్చినాఁ
డిష్టములెల్ల గూర్చుచు ననిష్టము మాన్చుచు నిట్లు చూడుఁడీ!॥ 384

సీ॥ పదియునొండగునేటఁ బ్రాగంభుఁడై దత్తు
చే నాస్తి మెడపోగుఁ జేర్చినాఁడు
కొడిగట్టుచదువునకు న్దైర్యచమురుంచి
జ్ఞానదీపికఁ బెంపు సల్పినాఁడు
పదమూఁటఁ బెండ్లియుం బదునేను బదునెన్మి
దులఁ బుత్రికలను నెక్కొలిపినాఁడు

ఏకవింశతిఁ బుత్త్రి నిచ్చి విద్యన్నేర్చి
యుద్యోగపథమునం దుంచినాఁడు,
కవితఁ బదుమూఁట సాగించి కావ్యనాట
కములఁ బదునారిటన్ సృష్టికలిపినాఁడు
కూర్చినాఁ డిర్వదియురెంటఁ గూఁతు పెండ్లి
సంతతారోగ్యసౌఖ్యం బొసంగినాఁడు॥ 335

క॥ కవితా గౌరవసన్మా
నవిశేషము గల్గినవమనాథదశ న్మా
ధవుఁ డగుమంత్రిప్రెగ్గడ
సువంశజ భుజంగ రాయసూరి గృహమునన్॥ 336

శా॥ మూఁట న్మీనమునందు దేవగురు నిమ్నం బొంది యుత్తేజముం
బాటిల్ల న్గని కేతువుంటఁ బ్రబలత్వం బొందె నుద్యోగము
న్నేటా మాండలికేశు దాఁపునఁ బ్రధానిత్వంబు సంధిల్లెన
ప్పాట న్నగ్గుచువచ్చె యత్నములు శుంభచ్ఛోభనాఢ్యంబులై॥ 337

క॥ పది కై దున కధిపతియై
పదిరెండిట శత్రునింటఁ బదుట న్వక్రుం
డెదుగుంబొముగుం దొరలని
పదవి న్నడిపించె రెండు పది వత్సరముల్॥ 338

గీ॥ వ్యయధనక్షేత్రముల గురుం డరయుచుంట
వ్యయము నార్జనముల్ క్షేత్రభవనలాభ
మధికధర్మాను బద్ధంబులై తనర్చె
సంస్కృతి న్లౌక్యమునఁ గూడ శంస నెగడ॥ 339

గీ॥ ఏడిటి న్లాభమును వాక్కు నినసుతుండు
కనుఁగొనుచునుండ దత్తత్సుఖంబు మిగుల
పరిమితంబుగ జనియెల్ల దొరలిపోయె
నన్నిటికి దైవభక్తియే మిన్నగాఁగ॥ 340

క॥ శని లగ్నధనేశత నై
దున మిత్రక్షేత్రసంగతుండగుట నను
న్మనవిచ్చెఁ జిరాయువుగా
ననయుంబుల ముంప కోర్చున నెర్వపరియై॥ 341

ఉ॥ ఏబదినాల్గు వత్సరము లీడవు డైన, దినేశ్వరుండురాఁ

గా బడి నొక్కయేడు చనఁగా వెస యోగవిశారదుఁడయ్యె ని
ష్ఠబడి యాతురావ్యవముల నిచ్చుచుఁ బాలక సంస్థ ప్రోవగా
రాజమున ద్వినందినము రంజిలదు స్తవితాకుమారితోన్॥ 342

చ॥ గ్రహబలదత్త శీఘ్రమతిఁ గాపుగఁ బ్రాపుగ దక్షిణక్రమా
ప్త హితమనువర్తన స్థవిలి పాపదము ల్త్యజియించి వృత్తి న
న్వహమును ధర్మతత్పరత నుండె లగించుచుఁ గష్టనిష్ఠుర
ప్రహతులఁ దాల్మి నైఁచి యొకపద్ధతి సంసరణాబ్ధినీదితిన్॥ 343

శా॥ సామాన్య స్థలలోన మాన్యతయె హెచ్చ న్నేరు సాధించి ని
స్సీమానుగ్రహదక్షదైవమును సాక్షిన్ సదా నిల్పుచు
న్సీమాంతస్థల వర్తనైతి నివుడేఁ జేయంగ నాలోక్యము
ల్గామింపం దగు కావ్యముల్ గలుగ వేలా యింకఁ దన్నోహముల్॥ 344

చ॥ వడసితిఁ బుత్త్రిల న్సుతల బంధుల. వారిని శక్తి నంచన
ల్త్రొడరనిరీతిఁ దన్పితిని లోపము సోకనిలాక్యవర్తన
న్నడపితి నిన్నినాళ్లు లేశఁ గాలము గావ్యకుమారితోడ నా
యొడయఁడు వాఁడనే నసఁగ నొప్పెడు దైవముతో వెలార్చెదన్॥ 345

సీ॥ బుధకావ్యగురుకృప నొప్పారించితిన్ శ్రీగ
  ణేశ్వరీయంబను కృతిని మొదట
భారవిచరితం బుపన్యసించితిఁ గావ్య
  ధోరణి న్సుఖశైలి తోఁచఁగలాడ
భారవియు మురారి పల్కిన కావ్యనా
  టకములఁ దెల్గుపొందిక నుడివితి
శ్రీకాళిదాసుని శాకుంతలము మేఘ
  ములకు దెల్గొనరించి పొగడుఁగంటి
గీతకు న్వార్చితిని కృష్ణగీత. సంత
  రించినాఁడఁ దెల్గున లహరీద్వయంబు
నన్నొకతకాదుల న్దేవు నెంచినాఁడ
  నఖిలము విత్తసీమ బ్రహ్మార్పణము గ॥ 346

గీ॥ వాణితోడ మదిష్టదైవంబుతోడ
యుగపదానందఖేలన మొదవు కట్టు
లనెడి యోజన మానసమందుఁ జాల
మునుపె ప్రభవించె నేపూర్వపుణ్యఫలమొ॥ 347

గీ॥ దండికవి యగ్రజుండు కోదండపాణి
మల్లికార్జునమకుటసమ్మానితంబు
వరసహస్రంబునకు వృత్తముల్ పెట్టఁ
బాడినాఁడ నన్యార్త్వని భక్తి యెదుగ॥ 348

చ॥ తనకుఁ గుటుంబపోషణకు దైవసమర్చనకు న్నరుండు బు
ద్ధిని దనకాలము న్దినకృతి న్వినియోగ మొనర్చుచో భవం
బునకుఁ గృతార్థతావహమొ? పొల్చునొ? వేర్విధి యెద్దియైన? నం
చనుదిన మెన్న నెన్న నొకయద్భుతసూక్ష్మము వెల్లడి న్గొనన్ 349

ఉ॥ దైవసమర్చనంబనిన దారుశిలాదుల పూజమాత్రమో?
అపలితత్త్వనాథుఁ బరమాత్మను వ్యాప్తుపటిఁ గొల్చుమాత్రమో?
నావిధి. వేఱెకెద్దియయిన న్గలదో? యనిశంక నోఁచ మే
ల్చేవల బాదరాయణముని చిత్రచరిత్రము తప్పి నెమ్మదిన్॥ 350

మ॥ నిగమాంతాఖిల శాస్త్రసంచయముల న్నిష్ణాతుఁ. డాత్మానుమో
ది. గతాత్ముండు. మునీశ్వరుండు, సమతాదీప్తుండు నారాయణుం
డుగ నర్చ్యుండుగదా! స్వమోక్షమున సంతోషింప, కల్కాలమం
దగుధర్మంబుఁ బురాణముఖ్యముల నేలా నింపె లీలాగతిన్?॥ 351

ఉ॥ అంతట నిండియుండుపరమాత్మను స్వాత్మవదైకదేశమం
దెంతు నటంట సంకుచితవృత్తి మంటకు సందియంబె? స
ర్వాంతరసంగతు న్దనుపనౌపరిచర్య సమస్తసృష్టి క
త్యంత మొనర్చుచుంటె పరమార్థముగా విశదీకరింపఁడే?॥ 352

ఉ॥ ఈశుభదృశ్యపథంబు వరియించియె సాగరసామ్యవాఙ్సుధా
రాశి ననేకపుస్తకవరంబులఁ గూరిచి నాఁడు నేఁడు వి
ద్యాశబలత్వము ల్తఱుఁగనట్టుల శాశ్వతకీర్తిశాలి పా
రాశరనందనుండు బుధరంజకుఁడై ధర కింపు నింపఁడే?॥ 353

మ॥ ఇది దృష్టాంతముగాఁగ భూమిపయి నాయామధ్యమం దెందఱో
సదయు ల్దక్షులు తన్నిగూఢపదవాస్తవ్యంబునే కాక శా
స్త్రదిదృక్షార్థవినూత్ననిత్యపథసంధానాఢ్యులై లోకసం
పదఁ గళ్యాణయుతంబుగా వలచి పెంపన్లేదె శంపాద్యుతిన్॥ 354

ఉ॥ వత్సరము ల్సహస్రములు పర్విడె నిప్పటి కైదొయారో! సం
వత్సముపేతసృష్టిని సమస్తముఁ బెంపుల విస్తరిల్లె నీ
యుత్సవము ల్గ్రథించుపని యున్నది యిప్పటివారి యాదలన్.

త్రాపరంభంబుల దక్షిణోత్తరధ్రువాగ్రిశేయయాత్రాక్రియా
ధౌరంధుర్యతఁ బూర్వమాతవకళాదాంపత్యము ల్కూర్పరే!॥ 363

చ॥ అనయ ముపక్రమించి బహుధాన్యపథంబులకు న్గ్రమించి యై
క్యనియతి విక్రమించి విజితాల్పమనీషుల పూర్వవిద్యల
న్గొనకొని సంగ్రహించి కడుగూఢకళార్థము వెల్వరించి త
ద్ఘన తరయోగశక్తి మొనగాండ్రయి రిప్డు ప్రతీచ్యపుంగవుల్॥ 364

క॥ మన చప్పన్నార్విద్యలు
మనల చతుష్షష్టికళలు మనమఱచినవె
ల్లను బనివడి తెలిసికొనుచుఁ
బెనుచుకొనిరి వా రపూర్వవిస్తృతు లమరన్॥ 365

ఉ॥ సాహసము న్సమర్థతయు శాసనదక్షత సర్వశాస్త్రసం
దోహను పాండితీపటిమ నూతనశాస్త్రసమాసకల్పనో
త్సాహము బశ్చిమార్యులకు సాంప్రతి మగ్రపదం బొసంగెనో
నూహకలంగ వారిదెస నూఱక చూఁతు మదేమిపాపమో!॥ 366

ఉ॥ వారల కట్టుజుట్టువస వారి విలాసవిహారరీతియు
న్వారల పానభోజనము వైఖరి మున్నగు వారిబాహ్యసం
చారముమాత్రమే వలచి చాలఁగఁ గొంటిమి కాని వారి మే
త్రీరుపులందు నొక్కటియుఁ దెచ్చికొన న్వసపోదు నేఁటికిన్॥ 367

మ॥ మనసామ్రాజ్యకళ ల్తొలంగె మతము ల్మాన్యంబులు న్సన్నగి
ల్లెను వ్యాపార మపాకృతం బగుచు నీల్గెన్ సద్గుణానీకము
ల్సనెఁ సన్న్యాసదనేకమార్గముల దాస్యం బబ్బె సంకెట్టిప
ట్రన మొందంగలమో నిపాతగతుల "భ్రష్టస్య కావాగతిః?"॥ 368

చ॥ ఉదరము నింపుకోఁ గలిగియుండుటె జన్మము సార్థకంబు నా
న్గుదిరిన యీదినాల మనగో డఖిలంబు యథాతథంబుగా
మదిఁ గనువాఁడు నూటి కొకమానిసియో న్మనలోన నున్న? యే
పదువురొ యున్న వారినుడి పాటిలునే పటుశక్తియుక్తమై॥ 369

చ॥ మనప్రముఖత్వ మెట్లు మటుమాయముగాఁ జనెనో? ప్రతీచ్యవ
ర్తన మది యెట్లు నేటుకొనె? తజ్జనసాధితనూత్నశాస్త్రము
ల్ఘనత నిడంగ నేకిటుకు కల్గెనొకో! సుజి లోకమాదిమం
డి నడిచినట్టి మానవుకథందిచరిత్రము నేప్రకారమో?॥ 370

చ॥ అసలు మనుష్యసృష్టి యెపుడయ్యెనొ? అంతకుముందు భూమిపై

వసతిగ నెట్టిజీవతతి వర్తిలెనో! మఱి వానికంటెము
న్మసలెనె యెద్దియైనను క్షమాజనయిత్రి జనించు టెప్పుడో
పొసఁగ నెఱింగి వ్రాయఁగడు బూర్వమునందె కుతూహలించితిన్॥

## —♦ కృతిసంకల్పము ♦—

క॥ మును గంజాం ఛత్రపురం
బున నుద్యోగమున నుండు ప్రొద్దులఁ గై
తను బాల్గొను మహితులతో
ననువుగఁ గాలంబు బుచ్చునపు డొకనాఁటన్॥ 372

ఆ॥ చెన్నరాజధానిమన్నించు గొపను
భార్యతోడఁ గొలుచువారితోడఁ
గళ్ళికోటరాజుగారి రంభాదేవ్య
భవనమునకు వచ్చు వార్త తెలియ॥ 373

క॥ ఆడంబరంబుఁ గనఁగోను
నాస గుమాస్తాలు పలువు రగుచునుండ
న్వ్యాసి తోడి కట్టి యనువగు
వేసముతో వారితోడ వెడలితి నేనున్॥ 374

క॥ పదితొమ్మిదివందలయి
ర్వదియైదవజనవరి న్నరగుమాడవనుం
దదినంబున బహుజనసం
పద రంభాస్వేష నధికభాసురమయ్యెన్॥ 375

ఉ॥ మే మటఁ జేరగా నెదిరె మేల్స్ఫలంబు శుభాయుతిప్రభా
భూమికగాఁగ యాగతము పొంది వారో యెసొంపుపెంపుల
స్తోమ జగీషఁ దర్కు లాలయించు విలాసకళామిళత్తను
స్తోమముల స్ఫురిపూర్ణశశిఁ దూలుచుఁ గుంద్రసి మోహదన్న్మెన్॥ 376

ఉ॥ ఆసాగనుందనంపు నెలు లాజులు లామెయి నేపళంబు లా
యామధ లూర్వ్యిలాసములు నావగకిన్నరవాగ్విశేషము
ల్మసరభానురాంగములు మింటి నెలంతల మించు విద్యుదా
ల్లాసమునింపఁ జూపరు లిల స్ఫురితమ్మ స్థితిఁ గాంచి రందఱున్॥ 377

ఉ॥ మోహిని మున్ను రాక్షసుల ముంచిన దివ్యమహేంద్రజాలమో!
మోహికిఁ దద్వరిష్ట నట మున్నుగఁ జూపెడి కామచిత్రమో!

నాహావణిల్లె యొంపవతజనంబు శతం బటఁ బోల్కి- భేదసం
దేహముతేనటు ల్వోలుచుదీప్తులఁ బెట్టెల సంచరించుచున్॥ 378
శా॥ వామ ల్యారలు వారిరాణి యగునేపాల్రాజ్ఞి రామేశ్వర
శ్రీశుద్ధ్యాత్రకుగాఁగ నేగెదరు వారిం దేటిచూడంగ రా
దీప్తమై విల్వక పోండటం చనియె నం దే పెద్దయుద్యోగియో,
మే మాచోటును వీడి ముచ్చటలమేల్మి న్గాంతద వేగఁగన్॥ 379
ఆ॥ దివ్యమగుసలూను దేదీప్యమానమై
ధవళకాంతి చుట్టుఁ దాండవింపఁ
జూచువారిచూడ్కిఁ జుబ్బనచూఁరగాఁ
గొనియెఁ గాంత మినుము గుంజానటులు॥ 380
క॥ కోణాకృతి నుపరితలము
శాణింప "సలూను" చెన్న రాజ్య గవర్న
ర్మాణిక్యవాహ మగుటను
జాణతనంబున నెఱుంగఁ జాటించె నటన్॥ 381
క॥ అవి పాలరాతిపలకలె
యవునో? అద్దంపుబిళ్ల లవునో? యన మే
లవు వెల్ల "పెంటు" కళల
న్మివుల సలూన్వాలితలంబు మెఱుఁగులఁ గురిసెన్॥ 382
క॥ వెలి వెల్లపూత కనువా
రల వారల చూపుతోడ గ్రహియించె దళ
త్తళలఁ బ్రతిబింబముల సర
సులకు న్సౌహార్ద మెందుఁ జోద్యమె యనఁగన్॥ 383
ఆ॥ ఇనుపదారిమీద నెసఁగియున్న "సెలూను"
పెటికి లోని కేగుపీలుకొలకు
నిలుపఁబడియె నడుమ నిశ్రేణి యొక్కటి
యొక్కప్రక్కఁ జేతియూఁత యొప్ప॥ 384
మ॥ వెలిసింగారముమాత్రమే కనుఁగొన స్వీలయ్యె లోపెంపును
న్దిలకింప న్గన "లెమ్మ! పో!" మ్మనుపాలి స్త్రీనంబు భంగించె ను
త్తలము ల్వ్రాకెడుకౌతుకం బన నరు ల్దాదవ్వుల న్నిల్చి య
ట్టుల నిక్కించి పదాల ముంగొనలపైఁ దోపాడి రొక్కుమ్మడిన్॥
క॥ ఆ సందడిసంములఁ బో

గీ॥ తిగుచుటయు "నమ్వారే!" యని మిగులువేడ్కఁ
జూచువారలచూడ్కు లచ్చోటఁ దగిలి
యనిమిషత్వంబు వహియించె నౌర! రంభఁ
దరియుటకు ముందు మానవత్వంబు చనదె!॥ 394

ఆ॥ ద్వారతోరణంబు దాఁటినంతనె యొక్క
ప్రక్కలాతుములను బహుకులముల
మేలిగుత్తములను మాలీసుచేయుట
కానఁబడియె వింతకదురులదుర॥ 395

గీ॥ చెట్లకొమ్మల వ్రేలెడి చిత్రచిత్ర
వర్ణముల కాగితపుగూండ్లు వాయుచలన
సంభ్రమించెడిసొగసు లాశ్చర్యము నిడె
వింతఁగనఁ బుల్గు లిట్లు కావించె ననఁగ॥ 396

క॥ నోరూరఁజేయు బహువిధ
సారామోదముల దెసలఁ జల్లుమిఠాయీ
లాకరపుదినుసులుఁ గాఫీ
టీరసములు వెలయు సంగడియుఁ దోఁచె నటఁ॥ 397

సీ॥ పుట్టఁ దొల్చెడిచీమ లట్టులు బలుపన్ను
లను జేయుభటుల చలాకి కొంత
"అటులుగా దిటుల! రా!" యని యాజ్ఞ లొసఁగెడి
యుద్యోగిజనముల యుదుటుఁ గొంత
రారాని గ్రామ్యజనారాటముల కడ్డు
పలుకు పోలీసుల పటిమ కొంత
యానాఁటి యుఱవునకై [illegible]రి వారితోఁ
దిరుగు సభ్యాగతోత్కరముఁ గొంత
తెరువుప్రక్కను కార్బైడుదీపములను
నిలుపఁ జనువారి పెనుహాళాహళిక కొంత
నాఁడు రంభాభవనజసౌందర్యమునకుఁ
జకచకలఁ గూర్చి యద్భుతోత్సవ మొసంగె॥ 398

గీ॥ చిలుకనరసున గుతుకంబు చెంగలింప
బాతువేటకుఁ జనినగవర్న రింక
రాత్రిఁ దొమ్మిదికేకాని రాఁ డటంచు

విని జనం బందుఁ గలవింతఁ గనఁ జరించె॥ 399

గీ॥ వెలిహజారంబుచెంగట నలవరించు
కొనిన యనిమేషదృష్టి విందునకునయ్యె
వైభవోపేతరంభాభవనముఁ జూడఁ
దివురుచో మైత్రి "సప్తపదీనమె" కద!॥ 400

సీ॥ దిగువ దీర్ఘంబులై యెగువ కేగుకొలంది
నొక్కింతకుఁ జుచ్చులై యుండుకతన
నిఱుప్రక్క వెల్లతో మెఱుఁగీను కుడ్యంబు
లొక్కింత యెత్తులై యుండుకతన
బహుళవర్ణములకంబళముల మధ్యస్థమై
యురుకాంతి వెలిఁబుచ్చుచుండుకతన,
పొట్ల కొద్దిక నంటి మించంగఁ దానిపై
పండులై పెనుచువ్వ లుండుకతనఁ,
గంబళముప్రక్కలను నున్నగాఱ మెఱయు
గచ్చు క్రమసంకుచితముగాఁ గ్రాలుకతన,
సందమై యోగ్యమై మహానంద మొసఁగెఁ
బలువురకు మేడముందుసోపానపంక్తి॥ 401

సీ॥ అవి నీటిబుగ్గలో! అలమల్లెమొగ్గలో!
నిలనేల? వాసన ల్చిలుకవేల?
అవి గాలిబుడగలో! అలకంచుబొంగడలో!
నిలనేల? ఖంగని పలుకవేల?
అవి వెన్నముద్దలో! దివిఁ జొక్కపొద్దులో!
నిలనేల? మినుకుల నిగుడవేల?
అవి చందమామలో! హంసముత్యములో!
నిలనేల! పురివిచ్చి కులుకవేల?
అనుచుఁ దర్కించుకొనుజనంబునకు విందుఁ
గొలుపుచు న్మించె మేడప్రక్కలకు నేల
వాలుగాఁ బ్రాఁకు తోరణప్రతతు లగుచు
బహుళములుగ నెలకొల్పిక్కబల్బుగములు॥ 402

క॥ భవనోపరితలమునఁగడు
సప్పరెపాడవైనగడ యొసంగె నొకటి న

ల్గవనులఁ దరిఁ ద్రొక్కాడులుగాఁ
దివిరి దాని నిలువు నిడుప తీవె లెడనర్ధ్ 403

క॥ అది తంతిలేనికంబము
విదితం బొనరించు లోకవృత్తమువని రా
చదు రెన్న నాకరంభా
మదిరాక్షికి నటకుఁ జేరుమార్గం బనన్॥ 404

క॥ దినదిన మాగడదారి భ
వనము న్దమిఁ జేరుచుండవలయు న్రంభా
వనజాక్షి, కానియెడఁ గ
ల్గునె రంభాభవన మనుటకు స్కృత మెందున్ 405

గీ॥ శ్రీగవర్నరుకోటకుఁ గైసేయఁబడిన
మేడలోనికి నొరులు పోఁగూడ దనుటఁ
బరిసరంబులఁ జూచుభాగమున జనులు
గుములుగుములుగఁ దిరిగి రావిమలభూమి॥ 406

సీ॥ పచ్చవినవకపుస్బట్టుకుచ్చులు నేల
పట్టంబులుగఁ గూర్చిపెట్టిరొక్కొ!
మరకతంబుల వెల్లి విరజల్లు మొఖమల్లు
గుదులేర్చి యొఱపుగాఁ గూర్చిరొక్కొ!
చిలుకవన్నియతూలికలమెత్తలను బన్ని
సెజ్జలిచ్చోటఁ గైసేసిరొక్కొ!
ఆకురంగువసందు పోకొసంగినయర్క
పుష్పంపురజ మిందుఁ బాదివిరొక్కొ!
యనఁగ, నిష్కంటకంబు, నత్యంతమృదుల
మాషదార్ద్రంబు నేత్రసంతోషకరము
నమలకోమలదళసహస్రాంచితంబు
నయినశాద్వలిస్థలి తోఁచె నందుముందు॥ 407

క॥ తీగలజల్లికఁ బెంగొను
పూగుత్తుల హరువు బహుళముగఁ జిత్రితమై
యా గొలయుకంబళము పై
భాగంబున వెలయు నొక్కపందిరి పొలిచెన్॥ 408

ఆ॥ ఆవికాలమైనయట్టిపందిరిక్రింద

మేలిబల్లపైని మెఱసె రెండు
మంచి యాసనములు మఱి ప్రక్కలందునుం
గలవు కొన్ని తరముకోలందు లోలయ॥ 409

క॥ పింగాణియువతి తళతళ
లం గులికెయుచు నాంగిలేయలక్ష్మి యనంగ నా
చెంగట నొయ్యారము చిలు
కంగొనియె విదృక్షునేత్రకైవారంబుల్॥ 410

చ॥ బహువిధపుష్పజాతుల సువాసన లాకలం దేలియాడం ద
ద్వహితను గంధవాహుండయి వాయు వెదురొక్కని కేలొసంగ వి
స్పృహం జన శ్రాంతి తేఱి జనబృందము "హాయి" యటంచుం జూడనం
దివాసురనందనం బన రహించె నలంతినికుంజ మచ్చటన్॥ 411

గీ॥ కలదు విశ్రాంతిగృహమా సందునం జెలంగు
నాసనంబులు కొన్ని యాయంతికములం
గలువలు స్వచ్ఛమూలు మైత్రిం గలిసి చెలంగ
నేత్రముల కింపు నిండించె నీటికుండు॥ 412

ఉ॥ కుండునడాస వాసవునికుంజరమో యన పల్లవేమనం గొ
క్కుండు సుధావికాసముగం గ్రుక్కుచు నూర్ధ్వము ప్రపసారమా
తుండమునుండి కుండ నగం దోయముల న్గురిపించుచుండె నా
దండం గనంగ నేవలయుం జాలిమి నెంతలిఖింప నేమగున్॥ 413

క॥ పందిరికిం బురోభాగము
నం దెడముగం బలురకంబు లగునాకృతుల
న్గొందఱు మందులచిత్రము
లం దం దమరించుచుండె రథికమసీషన్॥ 414

క॥ ఆవరణముచుట్టుం గల
తీవియల న్గాకితంపుదివ్వెలగూడుల్
శ్రీవాసవధనురుజ్జ్వల
తావిరళప్రభలం గూర్చె నానందంబుల్॥ 415

చ॥ ఇటుగడం బెద్దచెట్లు దెసలెక్కనకొమ్మల రెమ్మలాకులు
న్విరులును మందమారుతము విందుల మేలిపసందు లీన న
బ్బురమును హాయిం గూర్పం దగుపోక మనోహర హైనపీథి యొం
డరయంగనయ్యె దానిపయి నవ్వలి కేగి చరించునంతలోన్॥ 416

గీ॥ చరమసంధ్యాసమయదిగంబరవిలిప్త
సప్తకాంతులుఁ దనవర్ణసముదయములఁ
దళతళలఁ బెక్కుతోఁగులఁ దాండవింపఁ
జిలుకసంద్రంబు ముద్దులం జిలికె నచట॥ 417

సీ॥ ఆకొనియున్న దీర్ఘాహారశీలికిఁ
పలురకంబులరుచు ల్గొలుపుకూర
లూఱుగాయలు చారు లుక్కెఱి ల్చక్కెర
బ్బజ్జులు నిడ్డెన ల్పాయసమ్ము
గారెలుం బూరెలు ష్షండఖాద్యంబులు
న్బొబ్బుగుమీఁగడ లెన్నొ పెన్గొసరులఁ
దెప్పలై కుప్పలై దొప్పలం దొప్పలై
వడ్డించఁబడినట్లు ప్రకృతి యచట-
నధిక గౌరవనీయసమాగతులకుఁ
దరతరాధికబహుళసౌందర్యకళలఁ
దనసుసౌహార్దమును జూపెఁ దద్విలాస
మహాహా! సకలేంద్రియాప్యాయనాప్తిఁ దనిపె॥ 418

సీ॥ నీలము ల్తెళ్ళలు న్నలుపులుగా నలలలో
మింటి యాఁగడపమేల్మిని రహింప
నట కొండనీడ యస్త్రాద్రిఛాయ యనంగఁ
దమయు వైఖరిఁ బూని క్రమ్మత నెగయఁ
గెలఁకుల వ్రాళుల తాఁకుల స్వచ్ఛత న్సింధు
పలుగురా ల్మినుకుల భాతి మెఱయఁ
బల్లెకారుల దోనెపడవల న్దెరచాప
లందందు మొయిళుల చంద మొందఁ
జిలుకలో మిన్నె ప్రతిఫలించెనో? నభంబు
నందుఁ జిల్కయె ప్రతిబింబ మందెనోకొ?
అది యెటులనున్నఁ గనువారి యక్షులందు
రెండు బింబించి కన్నులపండు వొసఁగె 419

శా॥ చేచాయ న్బనసీటఁ బెద్దగుబురై చీఁకట్లలోఁ జేరి దోఁ
బూచు ల్కొల్వెదుచెట్లగుంపుఁ గనుఁ డీప్రొద్దందె సల్లక్ష్యమే
ధాచాతుర్యత బొతువేఁట ముదమందంబోయె మిత్రాళితో

నీ చెన్నాధిపుఁ డన్నమాట తరుచాయె న్గాలి నాచెంగటన్॥ 420

గీ॥ అగును కాఁబోలు! మృగయాంతమైనఁ గదలి
వచ్చుచున్నట్టు లాలంక వైపునుంచి
మేలిరెయియ్యారమున నీటఁ దేలియాడు
మెఱుగు "స్టీంబోటు" కనిపించె మినుకులెగయ!॥ 420

గీ॥ "ఏది? ఇటు వచ్చుచున్నదా?" లేను లేదు-
స్టేషనున కేగునట్లు సూచించుచున్న"
దనుచు జనులెల్లరు న్వాడి నచటువాసి
పలుగతుల నిశ్చితస్థానములకు నఱిఁక॥ 421

ఉ॥ అంతకు మున్నె దివ్యభవనాంగణ మంతికభూమి గత్వరయు
న్వింతలఁ గొల్పుగుమ్మటపు నెల్గుల నుజ్జ్వలవాయుదీపికా
సంతతుల న్దటిన్నికరసత్కళి కాంచుతతోంగ్ణాళి న
త్యంతవికాసితంబయి యనంతసుఖం బిడ నుజ్జనంబులన్॥ 422

గీ॥ చెన్నమన్నిఁ డిదే యింకుఁ జేరు నింక
ననెడి సంభ్రమకౌతుకాయత్త యయిన
రంభ తొడిఁగిన కళికాభరంబు దీప
రూపము లఁదద్విలాసంబుఁ జూపెనేమొ!॥ 423

గీ॥ ఆసహస్రాక్షలోకనివాసి యగుట
నాసహస్రాక్షసారూప్య మందె "రంభ"
వచ్చునాత్మాతిథి న్గాడనలఁగు నేడ్క-
దీపములపేరి వేకను దఱచుకతనః॥ 424

గీ॥ నీడ నలుమైన నచటఁ గన్పించునవిన
నావెలుఁగుపెంపు లెక్కింత యుక్తమగును
ఇంత యేమిటి కీవార్త నెఱిఁగి కాదె
నాఁడు చంద్రుండుగూడ రా నోడె దివికి॥ 425

మ॥ అదె మోటార్నదంబు దాఁకి దొలఁగుం డన్బంట్లు కేక ల్వాడి
న్నదుఁ డంచు న్సమయానుకూలవసతు ల్గ్రాపించు పెన్మ్రోఁకప
ల్రొదలు ల్నేఁగి యుడంగు వేళసరిగా "ఝం" యంచు "బుం" యంచుఁ ద
త్సదనప్రాంతముఁ జేరెఁ దత్కటరాజం బంత నొక్కింతలోన్॥ 426

సీ॥ కుడికన్నుఁ గుదిలించి యెడమకన్నెగిపించు
తపనేందునయను ప్రతాపమెంత?

నిగమాశ్వసమితిఁ బూనింగాని చపలేసి
త్రిపురాంతకుని దాడి తీవ్రమెంత?
దివిఁగాని భూమిపై డిగినంత నీరగు
మేఘసమ్రాట్ఘోష మిగు లదెంత?
వడిఁ దనంతట మార్చువడు పెలుఁగని వాయు
గమనసన్నాహసౌఖ్యంబు నెంత?
యటఁగ దీప్తోరుదీపద్వయంబుతోడ
వాహనము లేపవడితోడ భయదఘోష
తోడఁ దనయిచ్ఛ కమరుతుందుడుకుతోడ
వచ్చె నింకొక్క మోటారుబండి యటకు॥ 427

సీ॥ గంజాంకలెక్టరుగారు నారక్షక
సూపరింటెండెంటు సూరెలందు
డాడ్స్వర్తు భార్యతో డగ్గఱ శ్రీకళ్ళ
కోటరాజావారుఁ గూడినడువఁ
జిఱునవ్వు మోమున జిస్నవెన్నెలఁ గాయఁ
దనసతీమణియునుం దాను జెన్న
రాజధానీగవర్నరు గోషనుఁడు దేహ
రక్షకాధ్యులు వెంటరా నొయ్యార
మొనయుఠీవిని రంభాభవనము దరిసి
లలితరీతుల సోపానములను గడచి
మీఁది యంతస్థునకుఁ బోయె నాదిదృక్షు
వులు ననంతరగతుల్ కై పొదలునంత॥ 428

శా॥ శుక్రాచార్యున కొక్కటే నయనమంచు న్దారి నింతంతగా
వక్రించు న్గివి నాతఁ డంచును బురాణవ్యాప్తమే కాని త
ద్విక్రాంతి న్గనులారఁ గాంచితిమె? తచ్చిత్రంబుఁ జూపించెని
ర్వక్రప్రౌఢిమ నేకదీపయుతఁ జేసెన్నవ్యమోటారటన్॥ 429

గీ॥ రథ్య "టిక్కుక్కు-టిక్కుక్కు" రవళి శేఁగ
నాల్గుచక్రంబులు న్దొర్లు నాద మొగయు
మేలిగుజ్జంబుఁ బూన్చిన మేటిబగ్గి
యొకటి యేతెంచె మెఱుఁగుల నుదుటుఁ గొనుచు॥ 430

గీ॥ పత్రికలకు రిపోర్టుల నంపువారు

శ్రీగవర్నరుగారి యుద్యోగిజనులు
సపరివారంబుగా మేడనరస దిగిరి
విడుదలకు భోజనములకై వెడలి రంత॥ 481

గీ॥ బాలకుఁడు తోటివారితోపాటు తనకు
రానితాయిల్లకై గును పూనుస్వరము
మంద్రమధ్యమతారసంబంధమూర్చ
నల నట న్డోఁచె నొక్క చోఁ బలుతెఱంగుల॥ 482

క॥ ఆనాదము కత మెఱుఁగం
గానరు లచ్చోట మూఁగి కాంచిరి రాజ
స్థానిక సేవకు, మొగమున
దీనత వీరము, నిరాశఁ దెలిపెడివానిఁ॥ 483

క॥ "ఇచ్చిన నీయుం డీయఁగ
నిచ్చఁగొనని యెడల నీయ కేగుఁడు గాకీ
మచ్చున నేటికి నింద
ల్గురిచ్చఁగ? వేనీటఁ గొంపలుం గాలునొకో?॥ 484

క॥ పుచ్చుకొని మఱల నిట్టుల
వచ్చెదనే? యీయకుండవలసి నగడు నుపో
కచ్చువడ నింద నాపయిఁ
గుర్చెద రదిగాక యెఱుఁగరో నను మీరల్?॥" 485

క॥ అనువానివాక్యము ల్విని
తోఁణఁకక "అందఱము నెఱుఁగుదుము నినుఁ బో! పా"
మ్మనువారి ముందు కర నీఁ
ల్గినబాతులఁ జూచి కౌతుకితచిత్తములన్॥" 486

గీ॥ వేఁటవృత్తాంతమంతయు స్వ రెజీంగి
యుందు రడుగుచు మని జనబృంద మచట
నిలిచి తత్సేవకాళులఁ బలురకముల
ప్రశ్నముల వేయుటయు వాఁడు పలికె నిట్లు॥ 487

గీ॥ వేఁటవృత్తాంతమును మేము వినఁగలేదు
కాని తల్లబ్ధమున మాకు గలిగినట్టి
యీయులంతికి నాకు నా కీయ మనుచు
నిచట నొకవింతవేట చేయించుటయ్యె॥ 488

క॥ అని వారుపలుక విగతా
కను జనులరుగంగఁ దలచుసమయంబున దాఁ
పున "నౌరా! మేలగుగురి
యున నిట్లుండుగవలయు ననునుడి చెలఁగెన్॥ 439

క॥ అకథకు సహజసరసో
ద్రేకితవాఙ్మధురశుభగరీతుల కనువు
వ్రాకగు తన్ముఖభావ
శ్రీకల్పన శ్రోతృజనవశీకృతిఁ బొలిచెన్॥ 440

సీ॥ బెదరువేఁ టొక్కంత గదిరినంతనె పటా
పంచలై యెగిరినబాతుసాతుఁ
బఱచుబాతుల సూటి నెఱపు బాపుల మీటు
వేఁటకారుల పాఱువేఁట తేట
రవ్వతాఁకి సరాల్సరాల్న రాలెడువాని
పతనక్రమంబు సంభ్రమవిధంబు
బాతుల పఱవళ్ళు బారుల గురితళ్ళుఁ
గని మెచ్చుదొరసాన్ల కౌతుకంబుఁ
గనులఁ గట్టినరీతిఁ జొక్కమగుమేల్సి
నీమలోఁ జూపునట్లు వర్ణింప వినెడి
వారి దృష్టిపథంబు తద్వర్ణనముల
వెలయు సీనులతో నిండి పులకరించె॥ 441

ఉ॥ ఆపయి భోజనంపుసమయం బగుడు న్గని కళ్ళికోటరా
ట్ఛ్రీపరివారకల్పితవిశేషరసప్లుతము ల్భుజించి యా
ప్రాపునఁ జేఱుచిత్రములఁ బాఱుకుచింగను మందుచిత్రము
ల్చూపఁ దయారు కాఁబడినచోటికి నేగె జనంబు వేడ్కలన్॥ 442

ఉ॥ అంతకుమున్నె గౌపనుమహాత్ముఁడు సోదులసోద పందుల
న్నంతసమంది వందిరి నెసంగకపీఠములందు భార్యతోఁ
గాంతులఁ గొల్పుచు న్వెలయఁగాఁ బెఱగొంపనీయులెల్ల రా
చెంతల యాసనంబులను జేరిరి యోగ్యత కొప్పెంపునన్॥ 443

ఆ॥ రామచంద్రమద్రరాజదేవుని కన్న
సన్న యాజ్ఞమై యొసంగ నపుడు
గల్లుగల్లు రనెడిగజ్జెలరవళితోఁ

పాయకాళి రంగభాగ మొప్పె॥ 444

సీ॥ చెడ్డీలయంచుల జ్జెకట్లచివరల
నాళ్ళ గజ్జలు గల్లుగల్లు రనఁగఁ
గత్తుల న్డాలుల నైజార్ల బాకుల
న్దవిలి కాంతులు తళ్కుతళ్కు మనఁగఁ
బట్టీలఁ బరపళ్ళఁ బాదఘట్టనముల
న్ధరణీతలంబు థంథం యనంగఁ
దప్పెట్లధ్వని మించి తగుసింహనాదము
ల్లావాప్రసారవిఖ్యాతి నెఱప
సాముగరిడీల మొగ్గలసాధనముల
ద్వంద్వయుద్ధంపుఁబోకళ్ళ దమకుఁ గలుగు
నేర్పుఁ జూపిరి చూపరు ల్నిక్కి చూడఁ
బాయకుల్గొండ రయ్యుత్సవంబునందు॥ 445

సీ॥ పశ్చాత్పురఃపార్శ్వపరితఃప్రసారియా
ఖడ్గంబు వివిధచక్రములఁ గొలప
నాత్మరక్షణమున కనువైచకచక
స్ఫురణము ల్బహుళిత సంక్రమింప
నన్యప్రయుక్తబాణాసార మసిదాఁకి
చిటపటధ్వని మిట్టి చెదిరిపడఁగ
భ్రమణవేగంబుచే బహుదిశాభిముఖత
న్మహితేంద్రజాలసంపద గదిల్ల
నిజునుపై ఖడ్గపంజరాంతరసువిగ్ర
హంబు ద్రుతగతి భ్రమియించునట్లుఁ గాఁగ
మించుసాముల నేర్పుఁజూపించుకొనిరి
పాయకుల్గొండ రయ్యుత్సవంబునందు॥ 446

క॥ వరపాయకనృత్యమటులు
జరిగెడిచో నెదుటి శాద్వలస్థలి నార్చి
న్సురసురసి ముందువత్తి య
తిరయమ్మున రవల వెల్గెఁ దిర్యగ్గతులన్॥ 447

క॥ ఆవరుగులోన పటపట
దీపితములు గాఁదొడంగె దివ్యసువర్ణ

స్థాపితము "వెల్కమ్"మనునుడి
లోవలిరంగులమతాబులు వ్రేళ్ళ వెలుఁగన్॥ 448

మ॥ నవరత్నస్థగితాక్షరమ్ములన వర్ణంబు ప్రకాశింప నా
సవురు సన్గొనుచుండ దానిదరి నాశ్చర్యంబు సంధించుచు
న్దివిరె "న్యు"స్సని వేణుచక్రపరిధి న్దీపించు నవ్వాయి దా
నివడి న్జక్రము దిద్దిరన్దిరిగెఁ గాంతి న్జెంతల న్గొల్పుచున్॥ 449

శా॥ ఈచక్రభ్రమణంబు వెంట నదియే యేసూత్రసంధానమో!
సూచింపందగ కున్నయున్కిఁ బ్రదుటిలో జొబ్బిల్లె నావాసవ
శ్రీచాపద్యుతు లామతాబు లొకనారీరూప మానట్టు లా
హా! చిచ్చంతయుఁ గాల చక్రమునుగా హర్షించెఁ దద్వైఖరుల్॥

శా॥ శ్వేతద్వీపుఁడు సార్వభౌముఁ డగుజార్జిశ్రీనృపుం డాత్మవి
ఖ్యాతి న్గొపనరూపుకో విడిసె యోగ్యంబైన సుస్వాగతం
బాతం డొందుత రంభతో ననుచు బ్రాచ్యాధీశ్వరుం డంపిన
ట్లాతీరంబున మందుచె న్లైదిగె దివ్యత్కల్పవృక్షాకృతిన్॥ 451

శా॥ వైడూర్యంబులొ! కెంపుగుంపులొకో! మేల్వజ్రంబులో! పచ్చలో!
నాడెంబున్ఘనమౌక్తికంబులొకొ! విన్నాణంపునీలంబులో!
చూడ న్మెచ్చట లీనుకాంతుల దెస ల్వొల్పిల్ల వర్షించె దో
డ్తోడ న్రంగుమతాబు లత్తుశిఖాద్యోతము ల్వెతానింపఁగన్॥ 452

క॥ చూపినరంగు న్జూపక
తేప కొకటిగాఁగ నటఁ బ్రతిమతాబాయున్
జూపించె రంగులెన్నియొ
చూపఱు కట నైంద్రచాపశోభలు నిగుడన్॥ 453

శా॥ "ఎట్లూ! చెన్నపురీశుఁ డిం దతిథియై యేతేం మిాకానుక
ల్మట్టజేయ" రటంచు నాగతతి వేల్పుమ్మాకపై గాన్గుల
న్గొట్టింబో యెడునట్టు "టాట్లు" ధరణీగోళాంతరంబీగి ఫ
ట్ఫట్టంచు న్దివిఁ బ్రాకె "బుస్సు"గనురవ్వ ల్వాపచందాలుగన్॥ 454

చ॥ వడివడి నంతరిక్షము నవార్యతఁ జేరి పెటీల్న పెట్లసం
దడి సురసిద్ధకిన్నరగణంబులు సత్వరఁ జేరఁ గాఁగ బా
రెడు నవరత్నహారములఁ బ్రీతిని గొపనుగారిమీాద జా
ర్చెదునటు లొప్పె సత్కళలఁ జేన్లుగఁ దోఁచినమద్దబాణముల్॥ 455

శా॥ పాతాళంబుఁ ద్యజించి గొపనుల సంభావింప నాగేశ్వర

ప్రాంతంబు ల్తమి "నేను! నే"ననుపడి న్దైవిష్టవం బెక్క న
జ్జాతంబుల్ మ్రొక్కు లేర్చి సేస లిడు లెస్స న్భక్తమూక ల్భుచి
స్మితంబు ల్దివిఁ గప్పె న్మంతగతి జేజే లెల్ల "రామా!" యనన్ ॥ 456
క॥ ఈవిధమున బలు తెఱఁగులు
గా వెలసిన మందుపనులఁ గనుఁగొని చెన్న
శ్రీవిభుఁడు "సలాం" నునకు
న్వే విచ్చేసెను శ్రితాళి వెనుకొని కొలువన్ ॥ 457
ఆ॥ అతిథి సంతసించె ననుమోదమునఁ దన
తోడ నెల్ల రెంతొ తోష మొంద
రామచంద్రభద్రరాజదేవేంద్రుండు
వెలసె నాత్మభవనవీధి నంత॥ 458
ఉ॥ వచ్చినవారు కన్గొనిన వైభవము ల్మఱి నేర్పు వెంబడి
న్మెచ్చుచు నిండ్లకు న్మఱల నేమము జ్యోతిచర్యణంబుగా
వచ్చినసీనుల న్మది నాటిన వానిని జెప్పుకొంచుఁ బా
టచ్చెరవేళ ఛత్రపురి డగ్గఱి చేరిరి మాత్మవేశ్మముల్ ॥ 459
శా॥ దారి న్గూడగువారు కైకొనిన ప్రస్తావంబు లెన్నెన్నిగా
వూరుం జేరెడిదాఁక తెంపెసఁగ రా కొప్పెన్ సవా ల్గొత్త రార్
మీ తెల్పో విషయంబు లెన్నియొ సుసంస్పృష్టిన్ దదీయార్భటీ
సారం బీదిగువ న్లిఖించు సరసాల్పసిద్ధ్యాలల ట్లుంచుచున్ ॥ 460
క॥ మన సూర్యగ్రహ చక్రం
బున గ్రహము లిరాను లెపుడు పుట్టెనొ? కాలిచో
టున, గలవి వచ్చి చేరెనొ?
సనిదర్శనముగ నచింప, జాలమి తోఁచున్ ॥ 461
గీ॥ అవని తనచుట్టుఁ దిఱిగును ల్లైరువియు
రివ్వున న్దనచుట్టుఁ బరిభ్రమించు
భ్రమణ మందలి యొసిచేత భాస్కరాంశ
ముదుటునం జీలి చెదరుట లుండవచ్చు॥ 462
ఆ॥ భూమినుండి చీలిపోయిన ఖండము
ల్గారె తుఁజాడు శశియుఁ, గంజమిత్రు
మించు గొప్పరవి సమీపించి లాఁగుటఁ
బలు గ్రహంబులెల్ల వెలసెనంద్రు॥ 463

ఆ॥ మనభూమి యెట్టిరంగునఁ
గనుపడునో గ్రహాంతరములఁ గలవారలకున్
దన మూఁడువాళ్ళు నీటన్
మునిఁగియునికిఁ దెలుపె యెగువంబో త్రవిశరముల్॥ 464

చ॥ అవని రవిగ్రహోత్పతనమై యెపు డువ్వరమందు వేఁడిగాఁ
దివిరెనో? మంట లెన్నటికిఁ దీఱెనో? సంద్రము లెన్నినాళ్ళ కు
ద్భవిలెనో? నేల లెప్పు ప్రభవంబులో? యేతఱిఁ జెట్లు పుట్టె? జీ
వవివిధసృష్టి యేదినమొ? వల్కఁగరా దివమిత్థ మన్గతిన్॥ 465

ఉ॥ మంచుచు సూర్యుని న్విడి క్రమంబుగఁ బైకుము కాఱుచుండ నం
దుండు ద్రవంబులుం బయటిపొఁరలఁ జేఱె యనేకధాత్రులన్
కొండలు మంచుగడ్డలుగఁ గోటివిధంబుల నేర్పడ న్నిజా
ఖండప్రదక్షిణంబులఁ బ్రకాశిలు నియ్యల గర్భితాగ్నియై॥ 466

శా॥ ఆనా డబ్బినయగ్ని నేఁటికిని జల్లాఱంగ లేఁ దంచుఁ గ
న్గొనెఁ బెల్లుడిచిచ్చుకొండల నటం దోతెంచు ధూమాగ్నులన్
నానాద్రవ్యజలాయుగోద్గమనసంధానంబులన్ గూవగ
ర్తానూనోష్ణపరిస్థితిన్ ఖనసిద్ధాంగాదిపుంజంబులన్॥ 467

గీ॥ పెద్దకొండలపై మంచు పేఱుటేల?
లోఁతుపాతరల న్గాఁక హేతు వేమి?
గనుల రకసిబొ గ్గుం... నేదియొ?
భూగతాగ్నికి దప్పు దాపునెకదోయి!॥ 468

మ॥ ఇటులై భూగతవహ్ని సన్నగిలఁగా నేనాఁటికే న్గంద్రుపై
నటులే కేవలశీతమే ప్రబలి జీవావిష్కృతు ల్మాపెనా
నటుకా దారయ నుత్తరాయణమునం దంతర్గతోష్ణంబు మి
క్కుటమాచుండుఁజుమీ!పమీపచలదస్కంపిచ్చునా త్యాగ్నులన్॥

ఆ॥ ఇటులఁ నేలవేఁడి హెచ్చులొ చ్చగుపోక
లోహచయము భూమిలోన వెలసె
మన్ను నీరు గాలి మనగడయుం దాప
జీవవితతి పుట్టె సృష్టియందు॥ 470

శా॥ పాడు న్నేగడ గర్వ్యా దు మ్మిసుక కీవం చద్దు నూమొగ్గడు
న్గాడు న్నా న్నిఁసిల్లు మన్నులు మహాంతస్సారనాంద్రింబులై;
యాడాడ న్బైఱు మొలఁదు గంకఱ యహార్యస్యైర బహూత్కృతు

ల్నాడెం బీనఁగ రాతిభేదము లసంఖ్యాకంబు లౌ ధారుణిన్॥ 471

గీ॥ పంచభూతంబు లంతటఁ బ్రబలుమాల
కీశ్వరాంశంబు జీవ మం చెసఁగుదాని
మేళనంబున నస్ఫుటోన్మేష మోష
ధీప్రపంచంబుఁ గావించెఁ దెగలుఁగాఁగ॥ 472

క॥ సామాన్యంబుగ జపములె
భూమిం గలవృక్షనివహము, లూన్యక్షవరీ
త్సామహిమఁ దోఁచు జీవక
ళామాద్యచ్చేతసత్వలఘుకళ దాఁకన్॥ 473

క॥ సౌర గుమ్మడి నులితీఁగల
దరి ప్రేలిడఁ జుట్టుకొనును దానికిఁ; దాఁకన్
ద్వార పాఁడుచుకొనును వేళ్లొక
చిఱుమొక్కలు స్పర్శఁ దెలియుచె న్నటిఁగింపన్॥ 474

గీ॥ విరిసి చిఱురెమ్మ కిఱుగడ న్వాలయునాకు
లపరసంధ్యకు ముడుఁగుచు నంటుకొనవె
వేఁగుపర్యంతమును నిద్రఁ బోగునటులు
నిమురకన్నియుచె ట్టంట నిజముగాఁగ॥ 475

క॥ తనపూవును బ్రొద్దెటుతిజి
గిన సమ్మోయిఁ ద్రిప్పుకొనదె కేవలతమి నె
ట్టినయట్లు ప్రొద్దుతిరుగుడు?
తినుఁగొనఁ జేతనత యిట్లె క్రొంతఁ దనువులన్॥ 476

గీ॥ నేలబారుగఁ గాడల నిలిపియుంచి
చిక్కుజంతువుపడఁ జుట్టి చిక్కఁబట్టి
యాహారించెడి తరుజాతి యమరుఁ గొన్ని
దేశములఁ జేతనతఁ బెంపుఁ దెలుపుకొనుచు॥ 477

క॥ తనచుట్టుఁ గ్రోనుపరిధిన్
జెనకెడిజీవం బదెట్టిదేవ గలదియై
నను గుంజి పొదివి తినుతరు
వును గల దట జగతి మాఱుపుంతలలోనన్॥ 478

గీ॥ ఇంతయేల చిగుర్చుట యెదుగుచుంట
పూయుటయుఁ గాయుటయు బీజములనుగనుట

గాటిడఁ బొసఁగూర్చి వంగ్రబడు చెన్న
జేతవత చెట్లలోపల జైలఁగ నెగడ!॥ 479

గీ॥ పృథివికి న్మున్నె జల ముద్భవించెఁగాన
జలచరంబులె తొలుదొల్త వెలసె ననుట
న్యాయ మనిపించినను జేతవత్వగరిమ
వీని కొసగిరి రెండవస్థాన మవని॥ 480

శా॥ చెట్ల న్గుబ్బలుఁ దీఁవెలు న్మొదలుగా జిట్టెగుఁ దేకు న్వటం
బిట్లే మిక్కిలి గొప్పలెల్లఁ దుదగా నేర్పడ్డచందాననే
పొల్లిం బొనుసిమీనునుండి తనువు ల్పొంకంబులు న్వ్యాపృతు
ల్నెల్లొ లెక్కఁ దిమింగిలాద్గనుకఁ బొల్చె న్మత్స్యసందోహముల్॥ 481

క॥ తరుజాతి కదలకే పరి
సరధరఁ దమ కైనరసము జలవాయుసమా
దరణమునఁ గొని సుఖించు ని
తరవృత్తాదులకుఁ గీడు తగులనిదారిఁ 482

గీ॥ జలచరంబులో యీరీతి నిలువలేక
గాలి నీ ర్వాచులకుఁ దోడుగాఁగ గ్రమింగు
వాలుఁ గలనుఁ జినచిన్న వాలుగలను
మన స్వజాతివె"! యనియెడిమాట లేక॥ 483

మ॥ అరరే తివియు పెద్దచెట్టు తనకు న్వాలంబనం బొగలిఁ
బెఱుగఁ వృక్షము దాని కోర్చి పశిమా పెంపిచ్చు నం దాత్మహా
ని రయం బొనిరయుంబు గల్గినను నుం తే న్లెక్క యేసేయ కే
పరుసం బీవఱున జ్జలేచరముల్ ప్రాప్తింప నే హేతువో?॥ 484

గీ॥ స్థావరము లైననేమి వృక్షములు సాటి
లేనినాత్మీక మూర్తులై క్లేశ మఃక
వేలసంతాన మేటేట విస్తరిల్ల
దట్టమగుపెంపునఁ నింగిముట్టఁ బెరుగు॥ 485

క॥ మోకులు చుట్టగ నిముడని
ప్రాకులును నలువుచేర్లమాదిరిఁ దీవెల్
ప్రాకుకొని వెలయఁ దొలుతటి
కీకారణ్యంబు లెంతక్రిక్కిఱిసెనొకో!॥ 486

శా॥ నిండార న్బహుసారము ల్వెలయుక్షోణిఁ దైవసంకల్పతఁ

బెండుల్గా దొలుతొల్తఁ జెక్కఁగతు లాబీజంబు లెంతెంతమే
ల్దండిన్ వృద్ధి వహించెనో చిగురుపర్ణ బూవులు న్నాయలున్
బండ్లున్నాఁ గొవగొటిగీటయునఁ బర్వంబౌని యానాళ్లిలన్ 487

క॥ మూచూడనిపూవులతో
వాచవికి న్బాలుపడని పండ్లగొలలతోఁ
డైచెలఁగు మధువులతోఁ దరు
లేచి పెలుఁగఁ బోలు నవ్వ ఘల్లెడఁ దాన్నై॥ 488

గీ॥ ఎందుఁ బోకునష్టి పొందులాభం బను
రీతి నొకటి నొకటి ప్రీతిమీఱఁ
గౌఁగిలింప సాగుకరణిఁ గాండంబు ల
న్యోన్యత న్బెనంగ నొప్పెఁ దరులు॥ 489

ఆ॥ ఏర్చినాటినట్టులిందందుఁ జూడఁ బ్రఁ
త్యేకజాతివనము లేవుమీఱ
పక్వఫలరసాదిపానీయమధువులు
పొదలికాల్వ లేర్లు నదులుఁగాఁగ॥ 490

క॥ చిగురుంజొంపంబులఁ బూ
జిగురుల బహుకళలు పండ్లఁ జిక్కనిమధువుం
దొగరులనెల్లెడవెలచి
యొగుఱుల దైవంబె యనుభవించెనొ సుఖముల్॥ 491

మ॥ తమసర్వస్వము దైవతృప్తికయి సంధానించి ధ్యానస్థిరో
త్తమవృత్తి న్మనుటల్ నిశ్చలత స్వార్థత్యాగసంపాదన
భ్రమకం జిక్కక సర్వజీవతతికిన్ ప్రాప్తాంతికశ్రీకళా
గ్రిమసుస్థానచిరాయురుజ్జ్వలత కెక్కెంగాదె క్షోణీజముల్॥ 492

గీ॥ అలసరీసృపములు మొనలపిమృగము
లును ఖగంబులుఁ దమనీడ ననసి పెఱుగ
నిత్యసంతర్పణాగ్నుల నిన్నిటికిఁగూడఁ
దగినమహాశ్రయమ్ములై తనరెఁ దరులు॥ 493

క॥ ఘననిర్వ్యాజకృపారస
ఘనతకు నిర్వ్యాజకోపకారపరత్వం
బున నిత్యసేవ సలిపెడు
వనజములకు నీఁడె మీలు వనజము లేనిన్॥ 494

శా॥ నీటం గ్రుమ్మఱుజీవసంఘములకున్ నీర్పాచి నాఁచు న్నిరా
ఘాటాహారము లౌనుఁ దోల్త నమరెంగాఁబోలుఁ దర్వాత ము
ద్యోటం బుట్టినరొంపి లోహితతు లాయీచెట్లు జీవాలు న
ప్పాటింపుం బడయుంగఁబోలు ఝషజిహ్వాచాపలత్వంబునన్॥ 495

క॥ ఆపద గాచుకొనఁగ క్షుధ
బాపుకొనఁగ నోరె తమకుఁ బ్రాపౌ టనో
న్యాపాదితయుద్ధంబుల
దాపరిలఁగఁబోలు రక్తదశనత్వరుచుల్॥ 496

శా॥ ఏదుష్కాలమున న్నదీయుచి యుత్సేర్పడ్డదో! దానిలో
నేదార్ఢ్యంబు చెలంగునో! క్రమముగా నేపొంది కొన్నాళ్ళ క
య్యాదోరాశి జలేచరాళులను సత్వాఢ్యంబు లల్పాల్పజీ
వాదిప్రాశనమే ప్రధానముగ విన్యాసింపఁగాఁ బాల్పడెన్॥ 497

చ॥ విరివిఁ బ్రతిప్రసూతికిని వేలకువేలుగఁ బుట్టునంబుసం
చరముల కిట్టినాశము నెసంగకయుండిన నేడుసంద్రము
లొక్కఱుడ మెండువృద్ధిఁ గయికోవె? నశింపవె యొక్కపెట్టు? నా
దరువగుజీవనంబు చెడ దైవవిలాస మహో? విచిత్రమా॥ 498

శా॥ ఈవిన్యాసముకంటె శ్రేష్ఠతరమౌ సృష్టిం బ్రకల్పించు మే
ల్భావం బుద్భవమాటనో స్థలము లేర్పాటైనతర్వాత నా
దైవం బాత్మ్యవఁ గొల్ప భూరుహములన్ దజ్జాతిమాత్ర మిం
దే పన్నించుటలయ్యె సర్గగతిఁ బైతెన్నింక నెన్నందగున్॥ 499

మ॥ అటు లవ్యాజపరోపకారపరమవ్యాఘ్రగనానాతరు
స్ఫుటసౌఖ్యంబులలోన నైమటచి దేవుం డుండఁగాఁబోలు ను
త్కటదిగ్వ్యాప్తి మహీరుహంబు లుగ్గడిసైదట్టంబు లొప్పెంపునౌ
నటవు లొక్కన లరణ్యసంతతు లరణ్యానుల్గ సంధించెన్॥ 500

సీ॥ ఉయ్యాలచేర్లుగా నున్నతీవియలు క్రి
క్కిఱిసి చిక్కములుగా నల్లుఁదొడఁగ
వింజామరము లౌచు వీచుకొమ్మలకు నా
నాఁట మెండైన సాంద్రత్వ మమర
జలువల స్వేదజల్లు చాయ లెం దనుదులై
కుమిలించువేఁడికి న్గుదురులయ్యె
లలితతరామోదవిలసనంబు లడంగి

చెఱుకంపువరకళ్ళు కదల వెడలె
గీ॥ నిర్మలములై యొసంగెడి నీటిదోసలు
వితతకల్మషబహుళకలుషితము లయ్యెఁ
బండఁ దినఁ ద్రావ శ్వాసింప వలనువడక
సృష్టికర్తయు నుడివడి చిక్కువడఁగ॥ 501
ఉ॥ ఎంత యుపాయ ముప్పతిలె! నేమి యుపాయ మటంచు బిట్టుగాఁ
జింతిలి దైవ మిట్టటు నుసి న్వెసఁ బాఱె ననంగ నుద్ధతిన్
జెంతల నుద్గమించె నుడిచెన్నులఁ బెన్వడగాడ్పు దానిసం
క్రాంతికిఁ గొమ్మకొమ్మ పెనుఱాపిడ దావము ప్రజ్వరిల్లుటన్॥ 502
క॥ చిటచిట పటపట నాదో
త్కటముగ నెఱగలియుఁ బెంపుఁ గాంచి భయతరా
ర్భటులన్ రేగెడి జ్వాలాఁ
రటనంబుల వనుల నేర్చు రభసము నడుమన్ 503
శా॥ భూగర్భంబున నున్న బాడబము నేపుం గాంచి పెన్పొంగులన్
రేఁగ న్ధారుణి పెక్కుచో నుబికి యుద్రిక్తాగ్నిఫూత్కార రే
ఖాగర్భీకృతలోహవాహినుల నుల్కాపాతతీవ్రంబుగన్
మూఁగన్జేయఁగ మందునూర్వ్యనివిధంబుంబొందెభూదేవియున్॥ 504
ఉ॥ చిమ్మనగ్రోవులో యనఁగఁ జిమ్ముచుమల ల్దిశి కుద్గమింపఁగాఁ
జిమ్మె శిఖాస్వరూపముగఁ జేసి ద్రవీకృతలోహవాహినిన్
దొమ్మిగ నిక్కు తత్ప్రళయధూనప మూఁవఁ జలించి భూమిఖం
డమ్ములు కొన్ని క్రుంగుచు నడంగె సరిద్గిరివృక్షపాళితోన్॥ 505
ఉ॥ ఆపిదప న్వలాహకము లన్నియు హస్తికరోపమానధా
రావతనోగ్రత న్గురియ శ్రావణభాద్రపదంబుల న్నిదా
ఘావకృతు ల్నశింప శరదద్భుతకాంతిప్రవర్తిలన్ బున
ర్దీపితమయ్యె సృష్టి జగతిన్ నవశోభనకాంతు లీనుచున్॥ 506
గీ॥ తేప కీలాటిగండంబు లోపలేదు
నావసుంధర యనుచు విజ్ఞానవేత్త
సమరసోద్యోగపరమవిచారనియతిఁ
బూనె సృష్టింప జంగమంబులను జగతి॥ 507
క॥ ఒకదాని కొకటి భక్షగ
నొక దానికి నొకటి రక్షయుగఁదరగతులన్

రకములుగ సృష్టిఁ గొలిపెఁ

బ్రకృతియుఁ జేదోడుగాఁగ బరమాత్మ కృపన్॥ 508

క॥ క్రిమికీటకముల బహుచం

దములుగ వెలయించి తరులతాఫలనుమన

క్రమము తేతదోద్భిజ్యములుగ

నమర న్విధియించె ధరణి నయ్యెయెడఁన్॥ 509

చ॥ అమలమనీషఁ బూనుకొనినంతటిలోనె యనంతజీవబీ

జము లిల నుద్భవించి సహజప్రతియత్న నికామవృత్తియో

గములఁ బ్రచారము ల్వెలయఁగా మనుపోకలలో హఠాత్తుగా

నమరినసంగమక్రియలయందె స్వజాత్యభివృద్ధి వర్తిలన్॥ 510

మ॥ ప్రతిసర్గంబున జోక్య మింతయుఁ బరబ్రహ్మంబుపైఁ బెట్టక

ప్రతిమానాభినవోపసర్గకలనాప్రౌఢి న్బ్రపంచాదిసం

ధితజీవావళి నాఁడునాఁటికి సముద్దీపింప జాత్యంతరో

న్నతు లంతంతకు విస్తరిల్లెఁ గులవిజ్ఞానం బహాఘంబుగన్॥ 511

ఉ॥ ఆమెయిఁ గీటకంబులఁ బయుల్పడియెన్ భుజగంబులున్ ఖగ

స్తోమములున్ ఝషంబులుఁ బశుప్రజము న్బ్లవగాళి మర్త్యలిం

కేమహితాగ్రజాతి ప్రభవించునొ పైయుగభుక్తులందు కా

దీమనుజాగ్రసంభవ మికెయ్యది కల్గ యునంగవచ్చునే!॥ 512

మ॥ నియమం బింతయు లేసివర్తనముఃసంధిన్ నాఁటి కామంపుటు

న్నయ మొక్క న్భువి జాతిసంకరపుసంగంబు ల్ఘటస్థింప మెం

దయి లోకంబున జాతు లువ్వతిలెనా నన్యాయమా! వింతయా!

హాయము ల్గాసిదె లీవె యశ్వతరజాత్యావిష్కృతి న్నేఁటికిన్॥ 513

సీ॥ ఒకజాతిగాలి వేఱొకజాతితో మేళ

వింప నీరం బుద్భవించునట్లు

గాలులు లోహము ల్కలిసిన లోహేత

రంబులు ప్రభవించి క్రాలునట్లు

లోహాలు లోహంబులున్ సంక్రమింపగా

నితరలోహా ల్జనియించునట్లు

పసుపు సున్నము నీటఁ బవేళింప నెఱ్ఱని

పారాణగా మాఱె వఱలునట్లు

గీ॥ భిన్నజాతుల రక్తము లీగ్రహములును

కూడి జాత్యంతరోత్పత్తిఁ గొల్పు టరుదె?
జాతిసాంకర్య మొప్పనిచట్ట మొకటి
లేని తొలిఁటినాగరికసంతానగతుల॥ 514

క॥ నావాఁటి కసంఖ్యములై
జానొప్పఁగ జంగమముల జాత్యుపజాతి
ప్రాణులు వెలయఁగఁ జొచ్చె న
నూనవిలసనముల వనుల నుదకంబులలోన్॥ 515

చ॥ భువి నొకచోటనే మొదటఁ బుట్టి క్రమంబుగ నన్నిచోటులన్
గవిసెనొ? లేక యోగ్యమగుకాలమునన్ ధర నొక్కసారి ను
ద్భవిలెనొ యన్నిచోట్లఁ బలుప్రాణులు? చెప్పఁగలేము. గాలిగా
లివెలసి పోవుపుష్పొలవలె జ్జని యెందయినన్ ఘటిల్లెనో?॥ 516

ఉ॥ ఏదెటులైన నిప్పటిమహీవలయాన మనుష్యసృష్టియం
దే దయివారు భేదములు దేశవిభేదము వెంట రూపరే
ఖాదుల, నందుచే నచటనచ్చటఁ దొల్త నొకప్పుడే సమా
త్పాదిలె సృష్టి యంటయె యదార్థము దాపుగ సిద్ధమయ్యెడిన్॥ 517

క॥ ఔనేవా! దట్టముగా
నానుకొనుచు వెలయు తరులతారణ్యమహా
ధ్వానముల నెందొ కలిగిన
యానరశిశు వెట్లు పెరిగె నాతొలివేళన్?॥ 518

ఉ॥ తల్లియొ? తండ్రియో? హితులో? దాదులో? లే, ర్పసికందు పాలకే
న్గొల్లువనేడ్చుఁగాని మఱొకొం డొనరింప వలతికాదు చే
జల్లెడ మూఁగి నిండుఁగొను నీఁగ మొదల్లగు జాఁకఁ బెంపెటు
ల్బల్లెనొ? దైవమాయఁ కడుచిత్రమొ కాకదురూహ్యమెంతయున్॥ 5 9

క॥ పురపాలకసంఘము లిపు
పరమారోగ్యముల, భటుల బంధుల నడుమన్
బరరక్ష నేఁటిశిశు వా
క్కత్రుటి విడలేఁడు తల్లియాదరు వున్నన్॥ 520

క॥ చెడుపురువుల కాటులకున్
జెడుగాలులచేతఁ గలుగుచేటులకున్, క్రూ
ర్కడిమృగముల వేటులకున్
జెడక యెటు ల్పాఁటిబిడ్డ నిలిచి వెలసెనో?॥ 521

సీ॥ ఖరనఖంబులుం వాఁడిగలచంచువులును రె
క్కలు లేవు తనకుఁ బక్షులకువలెన
కోరలుం బంజాలుఁ గొమ్ములు న్లే వతి
బలవన్యమృగచయంబులకువలెన
దంశమాత్రమృతిప్రదవిషంబు లేదు పా
ములు మున్నయినజంతువులకువలెన
యులికించి చంపు విద్యుచ్ఛక్తియా లేదు
పలురకంబులగుచేవలకువలెన
పుట్టగనె లేచి తనపొట్టపోసికొనెడి
తెలివిపస లేదు పసులదూడలకువలెన
నలుగడల గండములె మూఁగునాఁడు మనిసి
నిసుగు లందెందఱోఁదలు నీల్గినారొ!॥ 522

సీ॥ కొండంతయెత్తు పక్షుల చంచువుల గోళ్లఁ
బక్షాహతుల డిల్లఁబడనిచోటు
చీమలుం దోమలుం జెదపుర్వు లురగము
లాక్రమించుగండము లక్కనిచోటు
శరభవారణసింహశార్దూలముఖ్యఘో
రమృగాహతులకుం దొలఁగుచోటు
వఱదలుం జెడుగాడ్పు లురుదవానలముల
గత్తఱ లెసఁగక గ్రాలుచోటు
నాఁటిధరణిఁ గికారణ్యకోటిఁ బడుము
గలుగదనినను సత్యోక్తి కానెకాదు
మిగులనద్భుత మాశ్చర్యముగ నెంచఁ
దప్పి బ్రతికెను మనిసి లేఁతపసుఁ గసిన॥ 523

సీ॥ అతికోమలము పల్చనైనశరీరంబు
ముండ్లఁ గండ్లను బ్రోది మోసె నెట్లు?
అంగస్వల్పము చేతివాంగు నల్పము కానఁ
బరువెత్తఁ బఱుగెత్త మరఁగె నెట్లు?
గోరు నిస్సార మెక్కుడుకోరపస లేదు
ముడిబోనమునను బెంపుఁగనె నెట్లు?
తనకు దక్షత లేదు తగునొజ్జ కలుగఁడు

సదుపాయముల హానిఁ జదివె నెట్లు?
కట్టుకొనఁ గప్పుకొనఁగ వల్కలము లేదు
చెనటుశీతాతపంబుల మవియె నెట్లు?
మిగులనద్భుత మాశ్చర్యముగ నె తోఁచుఁ
దప్పి బ్రతికెను మనిసిలేఁతనిసుఁ గసిన॥ 524

సీ॥ నీరు నివురుఁ జేయు నిప్పుక ల్చెరగు వే
సఁగుల దావాగ్ని సంజ్వరములందుఁ
బిఱుగు లెందడర నుప్పెనగాలిఁ గడవపో
తల గూర్చువర్ష ధారలకు నడుమ
దవుడలు కదెబడం దద్ద మేన్వడఁకించు
వలిగాలి పెనుపరవళ్ళలోనఁ
బలురొంపి దోంగయుబ్బులుల విషూచిము
ఖ్యాస్వస్థతలు రేఁగు నట్టితఱులఁ
దినఁగ నుండఁగఁ దలదాఁచుకొనఁగ వసతి
నీని పెనుగండముల కోర్వరానినాఁడు
తనదు యేడుపె ఘాతుకోద్ధానరుతిగ
మనిసి లేకూన యేయుటమటల బడెనో॥ 525

సీ॥ పవను స్వచ్ఛాస్వచ్ఛవిచారంబుఁ గనలేమిఁ
బీల్చి యేపదుపాల్ల వెతఁగుడిచెనో?
ఓషధీసదసద్విశేషంబు లెఱుఁగమిఁ
దిని యేరుజాదుల ననువు చెడెనో?
నీరంబు జెడుమంచి నిర్ణయింపఁగలేమిఁ
గ్రోలి యేకష్టాలఁ గుతిలఁగొనెనో?
దావశిఖానైజదారుణాజ్ఞానానఁ
గడుకొని యేయులజములఁ బడెనో?
బహువిధానిలబహులతాబహుళనీర
బహుకికారణ్యకంటకప్రబలపర్వ
తావృతావనిఁ దనజీవయాత్రయందు
నాదిమానవశిశువు దోఁగాడునాఁడు?॥ 526

చ॥ అనునిమిషం బనేకభయదాపద తెమ్మెయిఁ గ్రమ్మ పూర్వపు
దినములలోన నేఁటివలెనే పరుకాన్పులు కలైసంటకం

ఙను జనియించుకొనె నెగడె న్మను యౌవన మన్నురాణవా
ర్తనె గ్రహియింపఁ దేలు సుకరంబుగఁ దద్ఘనవృద్ధిహేతువుల్॥ 527

క॥ సృష్టివినిమయమున ను
త్కృష్టస్థితిఁ గాంచె నొకనికృష్టపుతెగనాన్
స్పష్టం బది యిదియదినా
నష్టం బిపు డొకచరిత్ర గ్రాలమినెచటన్॥ 528

ఉ॥ ఏయొకరీతినొకలిగె నీనరజాతి నిజానుకూలభూ
వ్యాయతఖండసీమల ననంతర మవ్వనవాసి జీవనో
పాయము లేవిధంబులొకొ? వాక్ప్రచయం బెపు డెట్లు పుట్టెనో?
న్యాయవివేక మేతఱుల నబ్బెనొ? లేవు చరిత్రసాక్ష్యముల్॥ 529

గీ॥ పరభృతంబుల పోలిక న్బరభృతులయి
పెరిగి రనుకొన్న నే ననంతరము మొదట
గ్రాసవాసంబు లెవ్వియో? కందమూల
పత్రఫలపుష్పములును గహ్వరములేమొ!॥ 530

గీ॥ అట జతుష్పాదజంతువిహారసరణి
దెలిసెఁగాఁబోలు నోషధీవిలసనములు
కాక మునుమున్న ధాన్యసంగ్రహముఁ బచన
విధియు విలసిల్లె ననుటకు న్వీలుకలదె?॥ 531

క॥ విజ్ఞానము తొలుదొల్త ను
పజ్ఞంగా కనుభవస్వభావజనితమై
యజ్ఞులగువారి దినగతిఁ
బ్రజ్ఞం గలిగించియుండవలయుఁ గ్రమమునన్॥ 532

ఉ॥ క్రోఁతులరీతిఁ జెట్లపయిఁ గొండఱపై నివసించి లేఁజిగు
ళ్లే తిని చెంగనాలఁ బఱుగెత్తి కొలంకులఁ గొండకాల్వలన్
ప్రీతిగ నీరుఁ గ్రోలి కడుస్వేచ్ఛఁ గిలార్చిననాఁటిహాయి యు
న్నే తమకిప్పు? డజ్ఞతయె నింకుసుఖం బననచ్చునేమొకో!॥ 533

క॥ నిప్పే యెఱుఁగరు చేతులు
తప్పినఁ బరికరము లెవియుఁ దమ కట లేవే
ముప్పునసే న్గేకలెకా
కెప్పాట న్భాషవఱల దెటు పెఁగిరొకో?॥ 534

గీ॥ గ్రహణశక్తి బాల్యంబునం గ్రాలుమిగుల

నల్లి నరసృష్టి కపుడు బాల్యదశగాన
నవసరము లగు వేళల న్నాబలాన
వస్తువిజ్ఞానము ద్వార న్బడసెనేమొ!॥ 535

ఆ॥ తప్పితాటి యొందొ తఱుచు లాహింసల
కెట్లొ తొలఁగి బలువు కేవుఁ గాంచి
జీవరక్షణమున కేవేవి వలయునో
వరుస నొందియుండవలయు నరుఁడు॥ 536

ఉ॥ ఎన్నొ యుపద్రవంబులు రహించెడి యాదిమకాలమందు నే
బన్నముఁ బాపుకోఁగలుగు శాహువనో బల మేమి లేనినాఁ
డెన్నర శైశవంబు మనియె న్దనయుంతనె యంటకంబె న
ష్టన్న మృగంబులో ఖగములో కొని మచ్చిక నన్నుఁ దప్పకో?॥ 537

మ॥ తొలుత న్వీరలు పోఁకచేర్పఁగ నుల్లుంగ్రోఁతులై కానవం
బులలో నద్రులఁ జెట్లపై గుహాలలో ముఖ్యంబుగా నిల్చి యా
కలమూ లాకులుఁ బండ్లు దుంపలను నాహారంబులై కొండవా
గులనీరంబులె దప్పివాప మనిరన్నోఁ దప్పె యొప్పేర్పుగున్॥ 538

శా॥ చింపంజీలు నురంగతాంగు తెలుఁగు లైబ్బగొరిల్లాలు మున్
జంపై మించు హిమప్రసారములఁగాన ల్మించున న్బేరి వ
ర్తింప న్వీల్పడకుండు వేళ వలస ల్రెక్కొ బయ ల్గొంది జీ
వింప న్సాగుట నాఁడు నాఁటఁ దమప్రాగ్వృత్తంబులన్వీడెన్॥ 539

చ॥ తరువులపైనఁ జైనములఁ దాఁటెడువాళులఁ గొమ్మ రెమ్మ సు
స్థిరముగఁ బట్టుకోఁదగిన చెన్నునఁ బాదములేనిఁ బాణ్వై
ఖరులనె యుండె; భూమిపయిఁ గాపురముల్నిరతంబు కానసం
తరము క్రమాన మానవపదంబుగమారెనొ యెన్నొ యేండ్లకున్॥ 540

మ॥ చలిబాధ ల్సమియింప మేనిపయిన న్సాంద్రంబు లౌ రోమము
ల్వెలుచంబాఱుచు నయ్యె నన్నములు హ్రాస్వంబు ల్ధివానాధుకాఁ
కలు మెండౌట, నదేవిధంబుగ సమగ్రం బైనమార్పొంది మ
ల్లులె మర్త్యులను దేలినారనుచుఁ దెల్పన్గొన్నిశాస్త్ర్యాలిలన్॥ 541

మత్త॥ వానరుం డని క్రోతిజాతికి వాడునట్టిపదంబు న
త్యాన కాదినిఁ దోఁకయుండని తాదృశంబులకే యనం
గానకు న్గనుఁగొన్నవెంబడిగా నరుండౌనా యన్నటు
ల్మానసంబున శంక తోఁచెడి మాత్రి నమ్మవి యుండుటన్॥ 542

మ॥ అవలంబించు ప్రవర్తనంబులకు నీ లౌకీతి నీకొన్నిట
న్వివరింపంబడినట్టిమార్పు వెలయు న్వారెల్లరున్ బృధ్వి మా
నవులై ప్రజ్ఞలఁ గాంచఁ దక్కినవనంగంబుల్ ప్లవంగస్థితి
న్గవులు న్గానలఁ గ్రమ్మఱ న్వసతులై క్రాల న్విపంచించెడిన్॥ 543

ఆ॥ వాడిగోళ్లు మొనలువాఁడినకోరలున్
బిరుసు తఱుచు నిడుపు కురుల యొడలు
నురువుతలలు, నిఱుకుమొగముబం గుండ్రని
కనుల నరులు నిపుడుఁ గలరు కాదె॥ 544

చ॥ కడఁక నభూతకల్పనముగా వరసంభవగాధ వ్రాయునే
ర్పడరు నెటుల్? చరిత్రకలనా? మఱి శాసనము ల్లభించునా?
పుడమిని ద్రవ్వఁ గన్పడెడిపుత్తొలఁ జూచియొ నాఁడునాఁడుపే
రుడు తెలిసున్నల న్గనియొ రూఢిపడన్గలుఁగా దదంశమేన్॥ 545

చ॥ విరివిగఁ దోఁచినట్లు పథి వెంబడి వారల యూహలెల్లనే
కరువులు బెట్టుకొం చిటులుగా నలరారిరి దొంగప్రొద్దునన్
బరగడి వేళ నూర్ధ్వగిసి వాసగృహంబులఁ జేరి కాళ్లనుం
గరములఁ దొల్చి క్రొంబుటముగట్టి జలంబుల ద్రావి నెమ్మదిన్॥ 546

ఉ॥ శయ్యఁ శయింప నిద్దుర యెసంగమి మానసవీధి నెన్నియో
యయ్యని యోజన ల్బొడబుడ ప్రభవించె వియూనవేగము
న్వియ్యము మీఱఁ గాలము నవీనసుఖప్రదసాధనాళితోఁ
దియ్యము లీనుచున్నసుగతి న్గను ఔంచుచు నబ్బ మెక్కఁగన్॥ 547

మ॥ కనుల న్విప్ప నభోంగణంబున నసంఖ్యంబుల్ శిరాలంబన
త్రవము ల్బక్క లసంఖ్యపుష్కలతతోఁ రాపాటు లేకుండుసం
తనతో నిగ్గులఁ దోఁచు పెంపునకు ముగ్ధం బైనచిత్తంబు పొం
దె నితాంతస్మయ మహార! సృష్టికళ కీదివ్యత్వ మెట్లబ్బెనో!॥ 548

మ॥ అవి నక్షత్రము లంద్రు క్షుద్రమన దేహంబౌట దేహంబులే
ని వటంచు న్బొగడు న్బదార్ధ మొకలేని న్భావ మేతీరొ? చు
క్కాని న్స్వామిలేక నేకోలతకు న్గానట్టి దొఁగాదె నీ
వ విడంగానము వాహతత్వ నునుమూనచ్ఛేదనఘ్నుత్తతన్॥ 549

చ॥ గగనపథంబు నొందిన కనంగా ధరయు న్సినాశ న్మనుంగి చు
క్కఁగఁ గనిపి చుసంటకును గానము సందియ మొందఁ గాన స
ట్లుగ న పదార్థజీవితతనంకటా! యుభయంబౌ! సండియుం

డఁగనగు వానిలోన ననుట న్విపరీత మొకండుఁ గల్గునే? ॥ 550

చ॥ ఇవి యెవ్వ డెట్లు పుట్టినారో? యిందలిజీవములెల్ల యెప్పుడు
ద్భవిలెనో? మానవుం డెపుడు తా నుదయంబగుటయ్యెఁ? బంచభూ
తవికృతిచేఁ బ్రయోజనము దైవము పొందున దేది? యంచు ను
ద్భవిడి జనించె మానసపథంబునఁ బ్రశ్నము లెన్నియేనియున్ ॥ 551

చ॥ అనుదిన మిట్టిశంక లనయంబును దోఁచుచునుండఁ దృప్తి గాఁ
గనుపడ దేజవా బిటులు కాలము ద్రొల్లుచునుండ సత్త్వవ
ర్తనమున నంతయు న్నపుడాఁకెఁ బ్రపంచసుఖానుభ(ప్ర)భం
జనహతి మోదఖేదవివశత్వము లొందుచునుంటిఁ దాల్మితోన్ ॥ 552

శా॥ సాయంభోజన మైనవెన్క భగవత్సాంద్రాజ్ఞనువ్యక్తిఁతో
బ్రాయంగాఁబడియున్న యేఘనుకవిత్వంబో పఠియించి సతి
స్థాయి న్గొంతపఠించుచు న్నిదురఁ బోనైయుండునభ్యాసమున్
బాయంజాల దివందివం బెపుడు నాయభ్యాసముగా నమ్మియున్ ॥ 553

శా॥ శ్రీసంపాదకలౌక్య వృత్తిఁ బవలు న్వెల్లించి విశ్రాంతి ని
ద్రాసౌఖ్యంబును జెందు నా కొకనిశాంతంబునన్ బ్రాప్తించెఁ జిం
తామాత్రత్రుటనాతిదక్ష మగుసత్స్వప్నంబు తత్సౌఖ్యము
న్నాసోదర్యులకు న్ఘటింప నిచట న్వ్రాకొందు నాకందువన్ ॥ 554

— స్వప్నవృత్తము —

చ॥ కలఁ గలయింద్రజాల మదికౌవలయు న్నయుపంబు విడి వి
చ్చలవిడి వ్యోమయానత నెసంగితి వ్యాప్తశరీరినై మఁ జు
క్కలు నట గాలిబంతులనఁగా వడిఁ గాళులసందునుండి చం
కలనడిచక్కఁ జుట్టును జకాచకల న్భ్రమియించె గుంపులై ॥ 555

చ॥ గ్రహములతోడ డీకొనినక్కై వడి రిక్కలు యాన వేగస
న్నహనముల న్శరీరమున నాటెనయు ట్లనిపించు మోముపై
నిహతియుఁగాన మేన నెటనే న్గనరాదు సొరంగ మబ్రమొ
క్కొ? హరుసమో? భయంబొ? యెదియున్వివరింపఁగ లేను నాకటన్ ॥

చ॥ హరువుగ నంత కాళము నాడెడినాళుప దేగనాఁగ నం
బరమున నున్న నేను నడిఁ బర్విడుచుంటినో నిల్చియుంటినో
యెఱుఁగనుగాని యంగలిడ నేధరయు న్గనరాదు క్రింద ను
ప్పరమున నాడ తెక్క లును బార్శ్వములు న్విలపిల్ల నద్దిరా! ॥ 557

ఉ॥ మిన్నులువడ్డచో టటుభ్రమించిన నెందును గోచరింప దే

లెన్నఁ బరీక్షఁ జేసిన నదేవనిగా గిటిగెంతులాడు న
ల్పాన్నలగోళము ల్పఱుఁగువాఱుచు దోఁచు ననేకదీప్తుల
గ్నన్నల కామెత ల్కొలువుకందువ లొప్పఁగ నుప్పరంబునన్॥ 558

మ॥ ఉదయం బస్తమయంబు నొక్కటికినే నున్నట్లు కన్పింప, ది
య్యది తూర్పిదెస పశ్చిమం బనుదిశావ్యాపారమే గోచరిం
ప దటు ల్బ్రొక్కలవజ్రుల న్భగవదంశ ల్బాచుచు న్వేవునా
కెదుట న్దవ్వునఁ దోఁచి మించె నొకవా ల్గింతింత నింతింతలై॥ 559

గీ॥ దగ్గఱుకొలంది మిగులస్పష్టమగు కాంతి
నింద్రనీలవియుత్తలం బెల్ల వెల్ల
వేయు నత్యున్నతం బైనవిగ్రహమున
వీణె వాయించు నొక్కవిన్నాణి యయ్యె॥ 560

శా॥ ఆవీణారుతి సొంపు, గానకళలో నాపెంపు నృత్యంబునం
దావైశద్యము, భక్తి నయ్యుచలితవ్యాపారముం గాంచి, యౌ
రా! వీ రాగురునారదర్షి నరులా? యౌ! నంచు నుప్పొంగి యే
నావెన్వెంటఁ జరింపసాగితి నమందానందసందోహినై॥ 561

ఉ॥ నారదుఁ డట్లు తోఁచి గగనంబున మించు విపంచి మీటుచు
న్దిజసిలోకసంచరణదీక్షఁ జరించుచు నాత్మగానవి
ద్యారమణీయవృత్తిక నిరంతర మాశ్రుతి సొంపుచుఁ జుట్టునుం
బాఱు ప్రపంచసంచలనఁ బాటిలు నాదము ప్రోదిఁ గూర్పఁగన్॥ 562

మ॥ హరి! నారాయణ! వాసుదేవ, పరమాత్మా కేశవా! మాధవా!
పురుషాగ్రేసర! భూతనాయక! స్వయంభూ! సచ్చిదానంద! శం
కర! సర్గస్థితిహారదక్ష! సకలాంగా? సర్వసారా! సమ
స్తరతా! రాగవిహీన! సర్వభువనాధ్యక్షా! నమస్తే నమః!॥ 563

మ॥ కరుణాసాగర! భక్తసంభరణసంకల్పా! సమస్తాఘని
ర్హారణా! సర్వసమాన! నిత్యజయశీలా! సంతతానందసం
చరణా! నామగుణాదిదూర! పరమేశా! శ్రీపరంధామ! ప్రే
మరతా! నిర్మలభక్తిగమ్యా! ఋషిసన్మాన్యా! పునస్తే నమః॥ 564

మ॥ అని వీణారుతి లీనమై బహుళభక్త్యావేశకంబై మనో
న్మన మహాగాన మొనర్చుచు న్రుచిరనృత్యం బాడు చున్గానమా
ర్చనల న్భక్తిరసామృతద్రవము ధారాళోరుధాగారఘనీ
నినదంబై భువనంబుల న్ననుప మాస్రశ్రేష్టుఁ డట్లుగుచోన్॥ 565

క॥ తనమార్గమునకు దాఁపై
చను దెంచుఖగోళగోళసంచయముల "ని
మ్మునివచ్చు! వచ్చు! నిట" కని
యనుకొని కనుచుండ దూరమైచనుఁ ద్రుటిలోన్॥ 566

ఉ॥ ఈమునిసార్వభౌముఁ డిపుడే భువనంబును జేరి యాత్మవి
ద్యామహిమ న్నదీయుఁ గృతార్థులఁ జేయఁగనున్నవాఁడొ! పూ
ర్వామలపుణ్యలేశమున నాఘనుదర్శనమైనఁ గల్గె నం
చీమెయి దాఁటిపోవు భువనేశులు ధన్యులమంచుఁ బల్కఁగన్॥ 567

ఉ॥ గానము మూర్తిఁ గైకొనినకైవడి భక్తి శుభావతారము
న్బూనినయట్లు, నాట్యకళ బొంది ధరించినచంద మొప్ప సు
జ్ఞానము పల్కపల్కన భృశంబుగ మింట వెలుంగుచుండ, న
మ్మౌనిపురందరుం డుపరిమార్గచరుం డయి యేగుచుండఁగన్॥ 568

చ॥ జలదపరీవృతంబులయి శాతశిఖాగ్రవేష్టితంబులై
పలుచలిరాలఁ జుట్టఁబడి పల్చనిమంచునఁ గమ్మ దేజి ని
స్తులితవిభాధికంబులయి శుభ్రమనోహరసౌమ్యకాంతులై
విలసిలు లోకగోళములు వేలకు వేల్పను వోవ సక్తతన్॥ 569

క॥ అతులమనోవేగంబున
నతిక్రమించెడిమహర్షి యాయాసృష్టి
స్థితు లొందుభువనముల క
ద్భుత మాత్మ న్గగురుమేనుఁ బొదువ, విపశ్చుఁడై॥ 570

క॥ శ్రీవాసుదేవపదరా
జీవంబుల బుద్ధి నిలిపి చేమోడ్చి సమ
స్తావస్థారహితుండై
కావించె మహాస్తవంబు గద్గదికమెయిన్॥ 571

క॥ కనుబొమలసందు గా మిం
టిని జూచుచు హస్తయుగము నిడుపుగఁ బైకి
న్జనసాచి, సృష్టికంతకు
జనకుఁ డయినదేవుదేవు సంస్తుతిఁ జేసెన్॥ 572

క॥ మోకాళ్లపైని నిలఁబడి
యాకుంచితశీర్షుఁడై కరాంజలి యెదపైఁ
దాఁక నిడి పరమపురుషుని

ప్రాకట మగుసామగానపద్ధతిఁ బొగిడెన్॥ 573

క॥ బోరన సాష్టాంగ మెఱఁగి
సారనిగమముఖ్నికాయసరసవచోవి
స్తారముల ననిర్వాచ్యుని
జేరినటులుగాఁగ వినుతిఁ జేసె విరివిగన్॥ 574

క॥ ఎగురుచుస్వరముల మహతి
న్నగముగఁ బలికించుకొనుచుఁ జొక్కెక్కి నచో
జగములను దనను మఱచుచు
భగవంతునిజూచునట్లు పరవశమొందున్॥ 575

శా॥ పాడున్ శ్రీధరు రాగమాలికలఁ దత్ప్రస్తారయోగ్యంబుగా
నాడున్జిత్రవిచిత్రనృత్యముల మేలౌ భక్తి యుప్పొంగఁగా
వేడున్భావములద్దినట్లు తననావేశింపఁ నుద్రేకియై
వీడు న్సర్వకలాప మాత్మవిభుని న్వీక్షించుచున్నట్టులై॥ 576

క॥ కలనాదస్వరసమ్య
క్కలనము రాగానులాపఘనత న్గలలో
కలుగుటలో తెలియునిగతి
నొలికించు స్వవిధరాగయుతవాహినులన్॥ 577

క॥ పులకలు తనువునఁ దేలఁగ
జలజలఁ గనుల న్మదశ్రుజల మొలుకఁగ నీ
రెలుఁగులన వాక్కు వెలలఁగఁ
బలుకు న్నోయి వైద్యుత్ప్రభాగతిఁ జెలఁగన్॥ 578

క॥ లలితములై కదళీఫల
మొలిచియిడినయట్టు లర్థ మూనుపదముల
స్ఫలరుచులఁ గురియుసాహితి
వెలయించు న్మధువు లెందు వెల్లివిరియఁగన్॥ 579

ఆ॥ పారదంబు గాజుపలకపై నిమ్నస్థ
లంబుఁ జేఱ నుఱుకు డంబుమీఱ
గానకవననాట్యగతుల నారదవాక్కు
బహుళఝురుల వెడలి బయలఁ బ్రాకె॥ 580

సీ॥ అమితతేజోరాశి యగుపాలమున్నీట
హాయిపు మీఱఁగఁ దేలియాడువాఁడ!

శ్రితవత్సలత యనుచిలువపైఁ బవళించి
తెగి సృజించినసేదఁ దీయువాఁడ!
పాపపుణ్యవిభేదపటలంబు నణఁగించి
సమదృష్టి రాజ్యంబు సలుపువాఁడ!
క్రీడించి యాడించి క్రిందుమీఁదొనరించి
యన్ని నీలోఁ దుది నణచువాఁడ!
కరుణగలవాఁడ! ముప్పోకఁ గ్రాలుతేఁడ!
గుణములన్నింటి దాఁటించుకొనెడిప్రోడ!
చాటులే కంతటిని జూడఁజాలువాఁడ!
వన్నియల నన్నిటి న్మించువన్నెకాఁడ!॥ ౬౮౧

సీ॥ త్రసరేణువులభాతి నెసఁగు బ్రహ్మాండంబు
లన్యోన్యఘట్టనం బందనటులు
సకలర్తుసౌఖ్యంబు జరుగంగఁ దనుచుట్టు
దిరుగుపోకడ లవ్వి తొలఁగనటులు
నున్నలోకము లెకా కెన్నింటి నింకసా
గించిన న్జదలఁ గ్రిక్కిఱిసినటులు
దమలోన వైద్యుతోత్తమమైత్రి భువనాళు
లెప్పుడేనియును మాయింపనటులు
సంతతావ్యాజకృప యెందుఁ జాలువాఁడ
క్షణికకోట్యంశమేనియుఁ దొలఁకులేని
మాతృవాత్సల్యసుఖము నమర్చువాఁడ!
వాఙ్మనస్సీమలకుఁ బట్టువడనివాఁడ!॥ ౬౮౨

సీ॥ ఒకచోట వివిధానిలోద్రేకితంబులై
వాయుగోళములు పెన్వడని సుడియ,
నొకచాయ నమితతేజోద్దీపకంబులై
యమరు జ్యోతిర్మండలములు వెలుఁగ,
నొకక్రేవఁ బలుదీవులకు మించుటద్దంబు
లై నీటిలోకంబు లాడుచుండ,
నొకవంక సకలభూమ్యాపేతములుగ భూ
భువనంబు లందందుఁ బొలిచి నడువ
నొకచో వాయుతేజోనిలోర్వీతత్త్వ

కలితమహితప్రపంచము ల్బలిసి కొలువ
మిన్ను సకలాంతరవ్యాప్తిమెలఁగ, మిగిలి
వెలయుపరమాత్మ నీకుఁ బ్రాంజలినొనర్తు॥ 583

సీ॥ చోటు లన్నియును నీ యాటపట్టులె కదా!
చాటు మాటని యెందు దాఁటఁగలవు?
పలుకు లన్నియు నిన్నుఁ దెలుపు నట్టివె కదా!
పలుకఁబో నని యెట్లు తొలఁగఁగలవు?
రూపు లన్నియు నీదుప్రాపు నొందినవె కా!
రూపించుకొనమి కె ట్లోపఁగలవు?
వెలుఁగు లన్నియు నీదు వలుకాంతులే కదా!
తెలిపించుకొన కెట్లు మెలఁగఁ గలవు?
పోల్చితిని నీదువృత్తి వదల్చుకొనఁగ
నాతరము నీతరముఁ గా దనాథనాథ!
భక్తపరతంత్ర! ప్రేమప్రవాహభావ!
ఆదిమధ్యాంతరహిత నిత్యస్వభావ!॥ 584

సీ॥ ఈరూపువాఁడ వం చెటులఁగి కొల్చెదనన్న
రూపులన్నింట నీపాప కోఁచు,
నీ పేరివాఁడవం చెంచి పిల్చెదనన్న
పేరులన్నింట నీసౌరె వెలయు
నీపోకడల పోవు నితఁ డంచు నెంతునా
అన్నిపోబడుల నీహాజ్ఞ తగులు
నీయూరివాఁడ వం చీక్షింతు నంటినా
ఊరులన్నింట నీయునికి కోఁచు
నుండి లేనట్లు లేక యెం దుండువాఁడ!
యెంచి యెన్నించుకొనెడి యకించనుండ!
కలిమి లేముల కందని మెలపువాఁడ!
సంతతానంతపదనివాసా! ముకుంద!॥" 585

ఉ॥ ఈగతిఁ దన్మయస్థితి ననేకవిధంబులఁ దివ్యబోధముం
బాగమలామృతామరసువాహినిఁ గొల్పుచు నేగుబ్రహ్మవి
ద్యాగురు వేగ మందుకొను దానికె డెప్పర మాచునుండ నా
యోగి కవిత్వగానసరసోదధియుం దలమున్కలొటయుం॥ 586

ఉ॥ ఆరససన్నిపాతమున కడ్డముఁ గొంకొ్పడి తెంపు రాదు! హృ
త్సారసమందు బుట్టు చెడుశంకల వాకొన శక్తికల్గునే!
నోరున విప్పు విప్పమియును న్గడుఁ దొట్రిలు మండ నింతలో
నారదమౌని యందుకొనె నాదకళాపరమార్థగానముల్॥ 587

క॥ లలితగతి స్సప్తస్వర
ములనే పండితులు పాడ మొదలిడఁ దత్సం
కలనవలనమూర్ఛనల
స్ఖల మగుహాయిఁబడి కొనమె పరవశత నిలన్॥ 588

క॥ సరిగమపధని యటంచును
స్వరము లిల స్వరఁగు సప్తసంఖ్యనె యనిబం
ధురపరమప్రస్తారాం
తరములఁ గళలెన్నొ నూతనస్వరయుతముల్॥ 589

క॥ ఆనూత్నస్వరపటిమ మ
నూనం బతిమోహనం బనూచానమునీ
ట్గానకళామండితమై
యానందమహాబ్ధి నోల లాడించె నన్॥ 590

చ॥ బయలున నెన్నొవన్నెల ప్రపంచములు న్దదనంతచిత్రని
ర్ణయకృతచాలనంబులు నసర్గళతద్భవనాదసంతతు
ల్వియదుపసక్తసర్వమును విస్మృతిపై ముని నే నటన్న ని
శ్చయమును బోయి రాగరససాగర మొక్కటె సర్వమాటయున్॥

ఉ॥ గాధసమాధి నన్నలమఁగావలయు న్దివిఁ గొంతసేపు స
మ్మూఢ మనంబులో నిలువఁ బోలును నేఁట నట్టిసమ్మదా
రూఢదశ న్ప్రవర్తిత మెఱుంగఁగ లేనయితి న్మహర్షి యో
గూఢముఁ బల్కియుండెనొకొ? కొట్టకొన న్వినసయ్యె నిమ్మెయిన్॥

చ॥ "ఒకయెడ నిల్వనీదు వివిధోజ్జ్వలలౌకికకేళి నాదువే
దృక్కమను ఫలంబుగాఁ గనఁగ డాంకృతి వీణియ మీటి నీయశః
ప్రకరణగీతము ల్పతము పాడుటకు న్వనరౌనె? సృష్టిరూ
పక! ఇదె కాలవాహినిఁ బ్రపంచపథంబులఁ జంక్రమించెదన్!"॥ 593

క॥ అనుచు మనోవేగంబున
జనియె న్నారదమహర్షి జాలి న్బదునా
మనమున కిదొ్భధముగాన్

గునగునఁ బద్యం బోకండు కుదురుకొని నిటుల్॥ 594

శా॥ శ్రీభూభోగరిరంసమద్విధములఁ బ్రేరేపఁ దజ్జాలమి
ధ్యాభావంబు నెఱుంగలేక రసచిత్రాంభోధిభంగంబులం
దాభీలంబున దూఁకు మర్త్యులకుపాస్యస్థానమై వెల్గుస
చ్ఛోభాతత్త్వము నిత్యభూతి రచియించుఙ్ లోకకళ్యాణముఙ్॥ 595

| పద్యం | పాదం | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 18 | 5 | వచించి | వంచించి |
| 28 | 12 | నలమరు | నలరుదు |
| 76 | 1 | వ్యాఘ్ర్య | వ్యాఘ్ర |
| 103 | 3 | స్చోయి | న్చోయి |
| | 4 | న్గోవ | న్గోవ |
| 227 | 2 | లార | లారా |
| 285 | 8 | న్వినవఁబడు | న్వినఁబడు |
| 246 | 1 | రామక్న | రామన్న |
| 268 | 4 | లపు | లప్పు |
| 265 | 2 | కృత్యబు | కృత్యంబు |
| 280 | 4 | కైవపము | కైవసము |
| 259 | 4 | టయుఙ్ | టయుఙ్ |
| 295 | 4 | మబ్మో | బొమ్మ |
| 301 | 1 | రాయసా | రాయపా |
| 310 | 2 | రైమొన | రైమెన |
| 313 | 1 | శాసలా | శాసనా |
| 327 | 1 | నపు | నప్పు |
| 351 | 2 | దీపుండు | దీప్పుండు |
| 360 | 1 | నోప్య | న్గోప్య |
| 376 | 4 | గుండని | గుండ్రని |
| 378 | 8 | హావణిలె | హావణిల్లె |
| 410 | 4 | నద్వృత్తు | దిద్వృత్తు |
| 418 | 8 | బణినట్లు | బడినట్లు |
| 424 | 4 | కనుఱచు | కనుద్రెఱచు |
| 445 | 9 | మొుగల | మొుగ్గల |
| 459 | 2 | స్మెచుచ్చు | స్మెచ్చుచు |
| 468 | 1 | పెద్కొం | పెద్దకొం |
| 471 | 2 | తస్పా | తస్పార |
| 492 | 1 | పధానించి | సంధానించి |
| 514 | 7 | బళింప | బవళింప |

# శ్రీ లోకకల్యాణము

## ద్వితీయాశ్వాసము - సంభవయుగము

### — స్వప్నపద్యతత్త్వాన్వేషణము —

శ్రీభూభోగరిరంస షడ్విధములఁ బ్రేరేపఁ దజ్జాలమి
ధ్యాభావంబు నెఱుంగలేక రసచిత్రాంభోధిభంగంబులం
దాభీలంబున దూఁకుమర్త్యుల కుపాస్యస్థానమై ప్రోచు స
చ్ఛోభాతత్త్వము నిత్యభూతి రచియించున్ లోకకల్యాణమున్॥ 1

చ॥ అని యలరాత్రి వేగుసమయంబున వర్తిలునాదుస్వప్నమం
దెనసెడినాటకాంతమున నేర్పడెఁ బద్యము! విస్మయంబు నె
మ్మనమున రేఁగుచుండినను మానవిధారణఁ బెక్కుమార్లు దా
నిని మననంబుసేత శయనించియెయుంటిని పూర్వరీతిగన్॥ 2

క॥ సర్వారంభప్రేరకుఁ
డర్వాచీనాధునాతనాగామిశుభాం
తర్వాసి వనుపుగా నది
పర్వెఁ బ్రక్తోక్తి మాఘబహుళచతుర్థిన్॥ 3

చ॥ పడుకొనియుంటిఁగాని కనుపట్టినస్వప్నములోనిగాథ తుం
దుడుకులఁ ద్రిమ్మరి న్మనసుతోఁ దఱిఁ గ్రమ్మరి నిద్రరామిచే
నుడుగక దే తలంచుకొనుచుంటి నహో! కలనైన నింతయున్
విడదుర బుద్ధిజాడ్యము కనిస్థితి కెట్టియమోఘశక్తియో!॥ 4

శా॥ నాత్మాబ్రహ్మమునన్సుజాతుఁడు మహాకాంతుండు ప్రాచేతసు
స్సీత్కాసీకృతరామకార్యకథకు న్జేయ న్దమున్గొన్నవా
డిత్కాదుర్లభుఁ డిట్లు స్వప్నదశయందే న్డాపి కన్పట్టుచో
దక్షుం డన్యుఁ డెవండు నావలె వృథా దాఁటించు నామేల్తతిన్॥ 5

చ॥ కనులు చలింపవాయె చెవి గానముతోడ నెనిండిపోయె మే
నున గతి దట్టమాయె మది నూత్నముదబ్ధి మునింగిపోయె నా
మునియె సమస్తమన్నటు లమోఘమహాద్భుతవిశ్వరూపియై
కనుపడనాయె నాత్రుటిని కన్పడఁడాయె! నిఁకేమిసేయుదున్?॥ 6

ఉ॥ ప్రకృతిగుణాధతత్త్వమును బ్రహ్మమొనర్పఁగ నైతిఁ జచ్చి యే
డకుఁ జను జీవకోటి యనుట ల్వినఁగోరఁగ నైతి భూతభ
ర్తను నెల వున్న దే? యణువదంబో? మహాత్మో? ద్వయాతిరిక్తమొం
డొకటిరొ సర్వహేతు? వనకుండితిఁ జేష్టలు తక్కన త్తతిన్॥ 7

శా॥ శోభాతత్త్వము నిత్యభూతి రచియించు న్లోకకళ్యాణ మర్
శ్రీభవ్యోక్తికిఁ దానకంబయిన తత్ప్రేమప్రపంచంబె యీ
భూభారప్రదశీల మందమొ? భళీ! భూభారనిర్వాపకా
ర్యాభీలం బనియందుమో? యొఱుక దృశ్యాదృశ్యత న్బర్వముల్॥ 8

ఉ॥ శ్రీయును, భూమి, భోగములు, సృష్టిఁ దమంతటఁ గల్గెనో? రస
ధ్యాయిత యేరి ప్రేరణమొ? తత్ఫల ముండునొ!, లేదొకో?, తద
ధ్యాయమె మిథ్యయైన నిఁక నవ్వల నెవ్వ రుపాస్యు? లే-? కి 9
యాయెడఁ దోఁచులోకశుభ మాపయి నెయ్యది?కార్య మెద్దియో?॥

చ॥ జగములు మిథ్యలా? తదభిసారినియంత యొకండె నిత్యుఁడా?
అగు నను కొన్నఁ, జెప్పఁగలమా కొల? యింతటి కాల ముం దిపో
వఁగలది మిథ్య యంచు? మఱి వాకొనఁగా దగనట్టు లుండు లో
కగములు శాశ్వతంబు లగుఁగా మనదృష్టికి నిత్యభూతులై॥ 10

మ॥ శతమానంబె మనుష్యజీవిత మిల న్సామాన్యమార్గాన. నీ
క్షితి జన్మించినవెన్క నెప్పటికిగల్గె న్మానవుం? డింత కె
న్నితరంగంబులుగాఁగఁ బుట్టుకలఁ జెందెన్మ్రింద? లెక్కింప నే
రితరంబో? నిటువంటియల్పులకు పేర్మి న్మిథ్య లోకంబనన్?॥ 11

చ॥ అది యొకశక్తియా?, ప్రకృతియా పెను దైవము? ముందు సృష్టిసం
పద నిగిడించి పెంచునది? పండితవర్యుల మన్న వారలే
అదవదసోక సుంత బదులాడఁగ నోరు మెదల్పఁజాల ర
భ్యుదయ మెఱుంగఁగా నెగిరియు న్జైకి తూలదె నందపల్లి యున్?॥ 12

ఉ॥ ఒక్కొకగాలిఁ బుట్టి మఱి యొక్కొకట న్నశియించుఁ బుద్బుదం,
బక్కట!, వానికి న్మనకు నాయువున న్గలభేద మెంత? యీ
లెక్క సికెన్ని కోట్లొ కనలేము ధరాసతిమున్క, సట్టిచోఁ
దక్కనభూత రాజిమఱి, దైవమునా యు వెఱుంగ నేస్తమే?॥ 13

మ॥ యుగము ల్వెక్కు గతించియుండు మనుజుం డుర్వి జ్జనిన్బొంది భూ
మిగతప్రాణుల. లోహపాళి. ద్రవలక్ష్మి. న్వాయుభేదంబుల
న్భగవచ్ఛక్తుల రేణుపంతయు నెఱుంగన్లేద యీనాఁటికిన్

దగు దేనంచు జగంబు మిథ్యయనుచుండం బెట్టివిన్నాణమో॥ 14

చ॥ పొరుగున నున్న చందురుని పొంత మెఱుంగము, వాని కావల
న్వెలుఁగుజు, బుధు న్గురు శనైశ్చరు, శుక్రుని, రాహుకేతుభా
స్కరుల నిటిట్టివార లనఁగాఁ బరికీలనచాల దింకఁ బై
తెరువుల నిత్యదేదుడునుదీప్తులతత్త్వము గుప్తమేకదా॥ 15

చ॥ ఇది యిటులుండ నింగిని రహించు నసంఖ్యము లౌచురిక్క లా
కుదు రసలేయగమ్య. మిదిగో మనసూర్యునికంటెఁ గోటికో
ట్లధికపుగొప్పసూర్యు లచట న్గలరం చెవరో వచింప విం
తఁదవిలి విందు, మంతియు! యథార్థమెఱింగిన నెట్లులుండునో!॥ 16

ఉ॥ ఇప్పటి కేబుధుండో కని యెంచినదవ్వగుసూర్యునుండి యీ
తిప్పకు వెల్గు చేరఁగ మదించిరి కాలముఁ జెప్పగిప్పఁగాఁ
జొప్పడనంత, నించుకగసూచనఁజేసెద దీనిఁబట్టి యీ
యుప్పరమందు రిక్కగమి నుండు నెడంబులు నూహ రాఁదగు॥ 17

సీ॥ విద్యుత్ప్రివాహంబు వెస రెప్పపాటులో
భూప్రదక్షిణమును బూర్తిసేయుఁ,
దన్మార్గమున వార్త తరణిని నన్నాట
యెనుబదింటనుగాని యెనయలేదు.
మాన కేఁబదిరెండుమాసము ల్పనఁగాని
దాఁపైనసూర్యుఁ జెందంగలేదు,
శ్రీవనుం డనుసూర్యుఁ జేరంగ నెనుబది
వత్సరంబులపైని వలసియుండు.
మిగులదవ్వైనభాస్కరుల దవులుకొలను
రెండువేలేండ్లు సరిపడకుండు ననిన
నితరరవిగోళముల నడిదూరములెల్ల
లెక్కిడి వ్రాయఁదగుపీలు జిక్కనొక్క!॥ 18

ఉ॥ ఇట్టియెడంబుల న్వెలుఁగునిట్టియవాంతరగోళరాజిఁ గ
న్పట్టెడియాకసంబు నడిపట్టున నెంతటియుద్ధకొ ల్తరమో!
పుట్టిన యున్న పుట్టఁగల బుద్ధిమదగ్రణు లెట్లుఁ జెప్పఁగా 19
దిట్టలుగారటన్నఁద దధీశ్వరతత్త్వము నెంచ యోగ్యులే?॥

క॥ ఆకసమునఁ బొగబుట్టల
పోక నసంఖ్యాకములుగఁ బొడలునుడు లివి

శ్లేకడల డీకొనని ని
ర్వ్యాకులగమనములఁ దిరుగుటది వింతగదా!॥ 20

క॥ ఊహాపోహాల నెన్నియొ
వ్యూహములుగ సృష్టిఁబలుక నొకయడ్డున్నే
మోహమ్మొ కాదొ నిస్సం
దేహమ్ముగఁ గొంద రిట్లు తెలిపిరి దానిన్॥ 21

ఉ॥ నింగినిగాలి వాయువునని ప్పనలంబుననీ ర్జలానభూ
మ్యంగన దానవోషధులు సంతటఁ బ్రాణిచయంబుఁ గల్గి స
త్త్వాంగసమృద్ధి సర్వజగదంతర నేత్రవిలాససంపద
న్పొంగుచుఁ గ్రుంగుచు న్మఱలఁ బుట్టుచు గిట్టుచు నుండు నెప్పుడున్

ఉ॥ ఆకసమూత్న్మరేఖలతతులం దనిలంబులు సవ్యదక్షిణా
నేకగతి న్జనించి వెస నిట్టటులుం దిరుగాడి కూడు ను
ద్రేకములందుఁ గల్గువిపరీతపుటగ్గిఁ దదీయవాయువు
ల్కాకలశో లగించుకొనఁగాఁ గలిగె న్జలగోళసంతతుల్॥ 23

ఉ॥ ఆకసముండఁగాననిన నంతకుముం దెదియుంటఁ గల్గెన
య్యాకస? మందు రైన నిఁకనంతముకల్గదు వాదులాట క
య్యాకసమందు దైవనియమానుగసంభ్రమణాదు లేర్పడ
న్గాఁక ద్రవంబులు న్గలిగెఁగాఁ గవలట్టుల నంటె యోగ్యమా॥ 24

క॥ ప్రాణాపానవ్యానో
దానసమానంబు లనఁగఁదగు నాదిమపం
చానిలముల నుపవాయు
శ్రీ నింగికి సృష్టికర్త లేఁపుచునుండున్॥ 25

ఉ॥ కాఁకల వాయువు ల్కాలువుకల్పముల న్బహుశద్రవాకృతు
ల్పేకొని యగ్గి దవ్వయినఁ జిక్కనఁ బాఱి ఘనీభవించి పైఁ
బైకొని నాఁడునాఁట బహువైఖరు లొప్పుధరాతలంబులై
యాకసమందు గోళగతినంది భ్రమించుచు సంచరించెడిన్॥ 26

మ॥ నిశఁ దోఁచు న్దివిఁ జొక్కవ ప్లోకహిమానీ సాంద్రసంపన్మహో
దశ నాకాశపురెండుడిప్పలకు బంధం బిచ్చు పెన్గొమ్మ పా
విశదం బౌనిజుచక్కి దాని కవల న్వీక్షింప నంతంతకె
చ్చు శిఖామూర్తులఁ బల్చనై వెలయునమ్మొగ్గొన్న నక్షత్రముల్॥ 27

చ॥ మునుపటిదివ్యదృష్టి మనపుణ్యవశంబునఁ గల్గెనేనిఁ గ

న్గౌననగుఁ బాలవెల్లియనఁ గూడినచుక్కపొగ న్బొరింజనిం
చినిగుడుగాలుల న్నిఖిల నీరముల న్ధరల న్దదంతరం
బున వటపత్రశాయి వటబొడ్డునఁ దమ్మి నజు న్సృజించితే॥ 28
ఉ॥ ఆకసమందు వాయువులు నగ్నులు నీళులు భూమి లెందుఁ బ్ర
త్యేకతఁ గల్గుసంఘటన నేర్పడి లాగుడుశక్తు లిచ్చుచు
న్నేకల బొంగరంబులనుపొందికఁ బొందిక రజ్జుబద్ధది
వ్యాకృతులట్టులై యెడములార్పక దేవుఁ బ్రదక్షిణించెడిన్॥ 29
గీ॥ అనుగతాత్మప్రదక్షిణాన్యోన్యగతుల
నగు దివారాత్రపక్షర్త్వయనము లఖిల
జడచరావననియమప్రసక్తశక్తి
బహుపదార్థంబు లొసఁగు శాశ్వతనిరూఢి॥ 30
శా॥ ఏదోహేతువుచేఁ బదార్థముల నాయారూపు నాశిల్లిన
న్గా దేనష్టి పదార్థతత్త్వమున. నూత్నంబై పరూ పొందుఁ, ద
త్ప్రాదుర్భావ మెఱుంగ నశ్వరము పారంపర్యతాప్రాప్తమే
నీదృశ్యం బఖిలం బటంచనుట నున్నే వాదదార్ఢ్యస్థితుల్? 31
ఉ॥ క్రాలెడివత్తి సాంతముగఁ గాలినఁ గన్పడ దంతమాత్రని
ర్మూలిత మంచనంగఁ గలమో? అప్పు డుద్భవమొందునావిరి
న్గాలిని భిన్నరూపములఁ గాంచి చెలంగుటలేదె? సృష్టిలీ
లాలుఠనంబు వస్తుగుణలక్షణనాశముసంగఁ జెల్లునే?॥ 32
ఉ॥ పండినదేహమందు భగవత్పరమాణువు జీవసంజ్ఞతో
నుండఁగఁ గానివేళఁ గలియు న్విడి దైవమునందు బొందియో
మండియొ కుళ్లియో కనుఁ గ్రమంబుగ భౌతికలీనతాస్థితి;
న్నెందును గ్రమ్మఱి న్జని ధరించును నూతనసంధిబంధముల్॥ 33
ఉ॥ కావున, శాశ్వతుం డనఁగఁ గల్గిన దైవమొ! శక్తియో! మఱే
దో విరచించుసృష్టి యిటు దొర్లుచునుండునె కాని నశ్వరం
బై వృథ కాదుఁ దైవకళయుంతయు నిత్యవిభూతి నుండు న
న్భావము స్వప్నపద్యమున వ్రత్తిలు పెల్ల సముండసం బగుల్॥ 34
ఉ॥ ఈవిధి నట్టిలట్టి యుదయించె మనంబున నెన్ని యెన్నియో
భావము లంతకున్మను లపంబు నెఱుంగనియట్టి వద్దిరా!
నే విశదంబుగా నడుగనేరకయున్నను నారదర్శిసం
భావన భావనాబలము ప్రౌఢతనొందెనో? వత్తెమీఱెనో?॥ 35

ఉ॥ అంతట లేచి కార్యములయందుఁ బ్రవర్తిలి నిత్యవృత్తి నా
క్రాంతమనస్కత న్మఱవుఁగాంచితి సర్వముఁ; గొంతమే యీ వృ
త్తాంతము నాఁడె యెందొ లిఖితందొ పఠింపుట కగ్గెఁ గాని చో
నింతయుఁ గాలలీనమయి యే వడియుండును విస్మృతిస్థలిన్॥ 36

చ॥ పదపడి ఛత్రపూర్వదలి బందరుఁజేరఁగనయ్యె నందు ని
ల్చుదినములందుఁ దీక్షకయెచొప్పడ దవ్వలఁ గాకినాడలోఁ
బాదలి విశాఖపట్టణముఁ బొందినయప్పుడుఁగూడ నక్లిక
ల్గదెపుడుఁ దీక్షపాటు చనెఁ గాలమిటుల్బహువత్సరంబులై॥ 37

శా॥ గుంటూరు క్రమ్మఱఁజేరుకొంటిఁ గడుచిక్కుల్గల్గ నేకాకినై
యుంట ల్సంభవమైనవాళ్ళఁ గృతు లెన్నో వ్రాసితి న్గాని యీ
వెంటం బాఱదుచిత్త మీశ్వరకృపావిఖ్యాతిచే నీశ్వర
న్గంటిన్ జైత్రసితార్ధపాద్యమిని దక్షప్రీతి మాహాత్మ్యస్ఫుటిన్॥ 38

ఉ॥ అప్పుడు ప్రాఁతకాగితము లన్నియు శోధనఁజూచుచుండఁగాఁ
జప్పున నిద్ది కంటఁబడెఁ జచ్చినబిడ్డ సజీవుఁడైనటు
ల్చెప్పఁగరానిసంతసము చేతమున న్గతిగెంతులాడఁ గం
డ్లప్పనఁజేసి తన్మయతనంది పఠించుచునుంటి నయ్యెడన్॥ 39

క॥ చనుదెంచె మదగ్రజుఁడు భు
వనగిరికోదండపాణిపండితవరుఁ డా
యన కభివందన మొనరిచి
వినిపించితిఁ గాగితమున వెలయునఖిలమున్॥ 40

మ॥ దయ వాత్సల్యము లేఁతన వ్వొగుప నాతర్కంబు సిద్ధాంత మం
తయు నాక్షేమపరత్వబుద్ధి నిని యోనాతన్ముఁడా! దైవని
ర్ణయసిద్ధ్యర్థము లెండటో బహుసముద్రగ్రీకసద్గ్రంథసం
చయము ల్నించి రదేమొ నిశ్చయము దృశ్యంబో నదృశ్యంబగున్॥

చ॥ ప్రకృతియె దైవమంద్రు భగవంతుపిశాచు యుటంద్రు మానుషుం
డ్రొకరొక రెన్ని హేతువుల నోపికతో గమనింప వారివా
రికథనె వాస్తవం బనుసరించు నటంచనిపింపుఁ గాని లౌ
కికమున నీవిచార మొకకృత్రిమజీవికగాఁ గనంబడున్॥ 42

ఉ॥ నీవనినట్లు సత్యబహునిర్మితరాజ్యము నిత్యమౌనకమా?
పైవరణీయమెద్ది? భగవంతుల మంచిఱహూదు! మట్లుకా
దే వివరింప! నీవిషయదీపకమై సుఖమిచ్చువృత్త మే

దేవిరళింపుమా! సుధనయించుకవిత్వము సార్థకంబుగన్॥ 43

ఉ॥ ఏ రచియున్న దానిని సరే యని పూనికకుఁ బ్రోత్సహించు టే
దారిగఁ గొన్నయున్న విహితం బుపదేశముగాఁగ నీగతి
స్ఫూరణమాయ స్వప్నపదవృత్తిని లోకహితోరుగాథ ని
ర్మేర చియింపఁబూనితి పరేశ్వరశక్త్యవబృంహితోక్తులన్॥ 44

మ॥ భగవత్తత్త్వమహాణువు ల్దివి భువి న్వర్తిల్లుగ్రస్తంబు ల
న్న గరిష్టంబగుతత్ప్రభావ మిటఁ గానన్రాదును మ్మేకదే
శగతి న్నాఁదగునే! స్ఫులింగమునఁ గాంచన్వచ్చునే దావవ
హ్ని గురుప్రౌఢిమ! మిట్టియుంతరమె యూహింపంగ స్పష్టంబగున్॥

మ॥ ఇదమిత్థం బని తెల్ప లోఁగ కెవరేయేబుద్ధికౌశల్యసం
పద నూహించిన నట్లుసిద్ధ మగుతత్త్వంబు స్వరామర్శ జ్ఞా
నదరిద్రస్థితి లౌక్యబద్ధులము నీనాఁబోంట్ల కేలా? పదో
పద! విందుంగథ విందు విందు రససంపల్లోకకళ్యాణ మున్॥ 46

క॥ లోకము లోకపదునా ర్గే
లోకముకళ్యాణమనుచు లోకువఁగన క
య్యా! కడుమనకూరుచుభూ
లోకముదే యేల యితరలోకపుగాడవల్?॥ 47

—♦ కావ్యసర్గమార్గాన్వేషణము ♦—

శా॥ పూనంగాబులుపాటమైఁ గడఁగితి న్మూలోకకళ్యాణనా
మానంబౌకృతి వ్రాయు నేది మొదలో? మధ్యంబెదో? పూర్తియెం
దో? నా నేమియుఁదోఁచ దట్టియెడ నేదో గాథయుం దానిపై
నావద్ధం బొనరించు నే ర్పమరనో నా? నాదుకించిద్జ్ఞతన్॥ 48

ఉ॥ ఏపనిసానుకూలతకు నేనియు దైవకృపాప్తి మేటి యా
యేపునఁ పూర్వపుణ్యసుఫలేష్యము వెంటడిగా శుభగ్రహ
శ్రీ పిదపన్సహాయతకుఁ జెల్లుచునుండు నొకింత దానిపై
కాపును బ్రాపు నొఁ బురుషకారము గెల్పిదు నెట్టిపూనికయున్॥

ఉ॥ కొండకు నాగలిన్గొలుపుకొంటవునో? కల బ్రహ్మమానిపే
రండ కృతార్థత న్గొలుపునా ననుఁ? మంచికిఁజెట్టకైనఁ గా
నుండిన దెట్లుఁగాకచనునోకో? శుభాయతిభార మెల్ల బ్ర
హ్మాండవిలాసనాటకనటాగ్రణిపై నిడి బండిఁ దోలెదన్॥ 50

చ॥ శ్రవణమొకాద్యె యాదయుపు సస్వర మాగమువాళి నేఁటికి

స్ఫువి విలసిల్లఁగా స్మృతియొపో గతి శాస్త్రచయంబువిల్వఁ ద
ద్వివరణ వాటభేదముల విస్తృతికిన్ స్ఫురణంబె కాదె మే
లవుపెనుబాట యీవఱకు? నార్యమహాజనసంప్రదాయికిన్॥ 51

ఉ॥ ఆగమపండితు ల్బుధమహాధ్యులు సూనృతవాక్కు లాగతా
నాగతసర్వవేదులు మహర్షులు నార్యులు లోకసంగ్రహో
ద్యోగమె పూని సాధితమహోజ్జ్వలశక్తులచే శ్రుతిస్మృతి
ప్రాగుదితంబు లన్నిటి పురాణముఖంబుల నిల్పనైరిగా॥ 52

ఉ॥ లేవుగ దాధునాతనకులీనమహోత్తరయంత్రశాల లా
లావున సుప్రయోగబహుళంబులఁ దారిచి శాస్త్రసూత్రసం
భావనలొంద! నన్నిటికిఁ బట్టుగుచు న్స్ఫురణంబె మేలిసం
జీవిగ నిల్పి తర్కకళచే బహుశాస్త్రభవంబుఁ గొల్పదే!॥ 53

మ॥ అలనాఁడెన్నఁడొ కేవలస్ఫురణతో నార్యు ల్ప్రపంచించుసూ
క్తులు నూటి న్గడుఁ దారకాణపడు నెందు న్నేటి నేలైనశా
లల యంత్రోరుసహాయసంపదలచే లబ్ధంబు లౌనిశ్చయం
బులతోఁ బ్రాక్తనసూరిశేఖరులపెంపుల్ జ్ఞానముప్పొంపుటుల్॥ 54

మ॥ అటు లంతస్ఫురణంబు లేఁపుకొనరాదా యున్న నేమాటప
ల్కుటయేఁ జుల్కన చేసిమాపుటనె నిల్చెన్నేటికష్టంబు లం
పట సంసారమె బ్రహ్మచర్యముఖశంసాయోగ్యయోగంబుగ
ల్గుటతే దిక్కులికాలకాళనిశఁ దెల్వ్యుల్వ్యాల నెలంకెగా!॥ 55

శా॥ పోనీ! శాశ్వతజీవులై ఘనపదంబు ల్పొంద నిర్ణీతులా
జ్ఞానిశ్రేష్ఠులు పల్వురుండుట పురాణప్రోక్తమౌ నైనఁ గ
న్గొనెల్లా నయువంటివారలను? భక్త్యోగు లాత్మానుసం
ధానాసక్తులు నిన్నిలోకముల నెద్దాన న్సుఖావాసులో?॥ 56

ఉ॥ గట్టిగ నొక్కని న్దలపఁగాఁ బొరపోయి యుతం డెవండురా
ముట్టఁగ నన్నుఁగోరునని మోదమున న్జను దెంచునందమా?
వట్టిదురాశసూ! తినఁడు పానముఁ జేయఁడు గాలిఁబీల్వఁ డిం
కె ట్టిదిసంభవించు? ఫలమే మడియాసలఁ గల్గఁబోయెడిన్॥ 57

ఉ॥ కొండల నెల్ల నెత్తయినకొండహిమాలయ మెక్కఁడైన నం
దుండఁడె పోదమన్న మునుపుండెనెపో! జను లెవ్వ రందుఁబో
కుండుట నేఁడొ మాటె కెవరోయొక రొక్కవిమానమెక్కి యా
దండల సంచరించుటమొదల్కొని యొండెడ కేగకుండిరే!॥ 58

మ॥ జనసంచారము దక్షిణధ్రువధర న్నాగంగలే దింక నే
గిన నేయొక్కరొ యిర్వురో అచట నున్కి న్నిల్పలేరైరి సం
తనతో నేగిన నందొకండయినఁ గానన్రాఁడె యంచొక్క యో
జన పర్యంతమది మర్త్యనైజవిమతేచ్ఛాలుప్తవిజ్ఞానత౯॥ 59

ఉ॥ అంతనె సంయమించుకొని యారఁ! యాదృశ్యత నేర్పు తావృశు
ల్క్రాంతలుగాని క్రాంతలకుఁ గాలుకొలందిగఁ జాతిపోవ నే
మంతమునింగి నింగి నెటనైనను సూక్ష్మశరీరధారునై
యెంతయొ స్వేచ్ఛమైఁ దిరుగరే పరమాత్మఁ బ్రదక్షిణించుచు౯॥ 60

క॥ అత్యుచ్ఛ్రితపుణ్యౌఘఫ
లాత్యంతానుభవ మిహమునందే యగున
స్సత్యము నేఁటిదె? భగవ
త్ప్రత్యక్షం బగుట నవతరణచేతనగా!॥ 61

ఉ॥ "ఆదియుగాలమాట నగునంతటికష్టము లేదు భక్తిసం
పాదనమాత్రనే సకలవాంఛితదాత పరాత్మ ప్రేమలకు
న్నాదన కేగుదెంచుఁ గలికాలమునం"దను సాంప్రదాయమ౯
లేదొకొ? పోల్చలో దెలివిలేమికి కెవ్వరి నేమి నాఁదగు౯?॥ 62

గీ॥ అద్భుతాపాదనముల కిం దదును లేదు
ప్రేమలఁ జూచినఁగాని నమ్మటకుఁగాదు
చూచియు నపార్థములకుఁ జొచ్చుటయుఁబోదు
శాస్త్రకృషి యింక గూఢప్రసక్తిగాదె॥ 63

క॥ రసమొలుకు గాథ నేర్పం
బసఁ జుట్టుంబోదివి సూత్రవర్గము వెలువ
ప్రసలోలుపత న్జదువను
లసలే గమనింపకుందు రాసూత్రముల౯॥ 64

ఉ॥ ఆవల నేదియెట్లయిననౌనని నాకొక కాలయాపనం
బై విలసిల్లు నిశ్చయమటంచు నొకింతను బూర్తికాని నా
నావిధకల్పనాగతిక సచ్చినమార్గమటంచు వార్షచే
తోవిధిఁ బూనువాఁడ నొకతో యధియంతటి యీమహాకృతి౯॥ 65

చ॥ ఒకసుముహూర్తమందు బుధులొప్పినరీతి సమస్తభావనా
టకపరమాగ్రయాయికిఁ గడంక మదంకితము న్నొనర్చి శో
ధకజనకల్పవృక్షమును దత్త్వసుదోహకకామధేనువు

స్సత్కృతుల కాలవాల మగుచు న్దగుపుస్తకకోటికోశముల్॥ 66

శా॥ నాయత్నంబున కైన పెన్నిధిగ స్వాంతంబందు నూహించి యా
చాయ న్బన్నగరంబు జేగి బహుశాస్త్రప్రౌఢవిన్యాసమం
దేయొక్కింతలొ యందునందుఁ గొని నాయీలోకకళ్యాణవా
ర్తాయోగంబున కుద్యమింతు! సఫలారంభంబుగా నెగ్గుతన్!॥ 67

—♦ ప్రత్యావిష్కరణము ♦—

చ॥ అని యొకనాఁ డుషస్సమయమందు మెలంకువనొంది కాల్యవ
ర్తనములొనర్చి విఘ్నరహిత మ్మగుమేలివివిక్తసీమ యో
గనిరతముద్ర లో వెలిలగాముల నింద్రియవాజిరాజిఁ బె
ల్చనియమించి కన్మొగిచి లక్ష్యము భ్రూయుగమధ్య మొందఁగన్॥

మ॥ పవలున్రేయి మణిప్రవాళగతి నేర్పాటైనచందానఁ జి
త్తవియత్కాంతి నొకింతసే పమరినంత న్గిఱులై చుక్కలై
రవలై వెల్గులడంగఁ జీకటియె యుగ్రంబై యొట న్నిండె స
ర్వవిలాసంబులు మాసి మానసము కేంద్రశ్రీస్థితిం దాల్పఁగన్॥ 69

శా॥ ఊహాద్వారముమాత్రమే తెఱపిగా నుండంగఁ బ్రారబ్ధస
న్నాహావేశతనేమొ ఛోఁచె జగదండస్ఫూర్తి లేనప్పు డి
ట్టే హేవాకత నెల్లచోఁ దమమె నిల్పెన్నాఁగ నిద్రాళువై
"సోఽహం"శబ్దము నీవఁబోనిదొర తద్వ్యాప్తిన్ శయానుండుగన్॥

చ॥ మనసుమనస్సు మానపరిమాణము వన్మనప్రమాణమా
ర్గణమహాదున్మనస్థితి మగంటిమిఁ బ్రాకృతమాయకైన నే
టనఁదగుఁగాదె పోబడి క్రమాధ్వమునన్మగిడింప నేర్చుప్రా
జ్ఞన కఖిలంబుఁ దంగెడులజున్నగుఁ గాలవిభేదరాహితిన్॥ 71

చ॥ తటుకున జ్ఞప్తిఁదట్టెఁ బరతత్త్వవిదుండగువ్యాససూక్తి యం
తటఁ బరమాంధకారవితతస్థితి సృష్టికిము న్జెలంగ వె
ల్పటఁ బరమాత్మ యంటనిశుభస్థితి నుండునటంట నాఁగఁ జీ
కటికిని మేటియానకటగా! యిఁక వ్యాప్తిసమత్వముండియున్॥ 72

శా॥ అర్కన్దొట్టి గ్రహాలుఁ జుక్కలును శ్రీరాధ్యంబును న్శాంతిసం
పర్కం బుండుసమస్త మస్తమిల సంస్థాత్మప్రథ న్దిక్కుల
న్గానోక్కనౌనది నీలమూతమనె కాన న్గాదొకో విష్ణుజ్ఞా
నార్కు ల్లన్లనిమేనివానిగ నెఱుంగన్శాంతుచిత్తంబులన్॥ 73

ఉ॥ ఎన్నియుగాలుగాఁగఁ దమమే తనుగా నదిలేదు సర్వ మం

దున్నదినా న్విడంబడక రొక్కఁడొ పెక్కురొ పుంజొ పెంటియో
యొన్నఁగరాక యేచలనమేనియు లేక టులుండెనో క్కొ! యీ
కన్నది చిత్తవిభ్రమవికాసమొకో? యనుశంకతో నిలన్॥ 74

శా॥ అంతస్సంవృతసర్వశక్తుఁడగుచో నంగంబుల న్లోనికి
న్నంతంబు న్వెస లాగుకోఁగలిగి బొండంబట్టు లాకూర్మము
న్బంతు న్దావహియించు దైవ మనుమేల్వైచిత్రి లోనెంచి యా
యంతుం గంతునుగా కటంచుఁ బరమాత్మాబద్ధసిద్ధస్ఫురన్॥ 75

చ॥ చిలిపిమనంబు నైజపుచిచిందిరిచిందులఁ జిందఁజూచుట
ల్నిలుపుచు నంటిపట్టి కడుసిళ్ళలత న్సకలస్థితి న్భవ
త్రిలెడిమహాంధకారనిబిరీసతనే సుసమాహితుండనై
పలుదిపసంబు లీక్రియ నుపాస్తి మహావ్రతంబుఁగాఁ గొనన్॥ 76

మ॥ సకలప్రాణులు గాఢనిద్రఁబడియున్ శ్వాసించునే కాదె నా
నక! చైతన్యము లింద్రియంబులకుఁ జన్నంగూడ రక్తప్రసా
రకనాడీగతి సాగునేకదె! విచిత్రం బీతమశ్శయ్యఁ గూ
రుకువిన్నాణికిఁ గాన నేవిధపునూర్పు ల్నిక్కుగల్పాటలన్॥ 77

ఉ॥ కేల్విసరంగఁ దాఁక గమకింప ఘనంబు ద్రవంబు గాలి నా
న్నిల్వ దొకడ్డు త్వక్కునకు నేన్బరమోష్ణమొకో కదుష్ణమో
చల్వయొ సోక దౌర! కరచాలన మెన్నుటకాని యంగమో
వెల్వడదమ్మయి న్విసికి వేసరనేను దత్వకాంక్షినై॥ 78

మ॥ వివిధాసక్తివిశేషతీవ్రగమనోద్వేగాకఁ బెన్భ్రాంతి నా
నవు లెట్లట్ల పురాపురాణకథితానంతర్యసృష్టిక్రమం
బు వివృత్తి న్బరిణామపూర్తి బహుళాంశుస్ఫోరకప్రౌఢిగో
మిని లెన్నామదిఁ బద్ధువేక లగునూర్మిభ్రాంతివిభ్రంకాతులన్॥ 79

చ॥ నను మఱపించుగాఢకలన న్దొలివాసన లీగతి న్సదు
ల్గొని మనసుం గలంచు తెఱఁగో యిది? వ్యక్తగతి న్బరిక్రమిం
ప నిగుడుచిద్విలాసగరిమంబొకొ? యేర్పడునంతదాఁక సా
క్షినయి యెనిల్తు నన్నదృఢచిత్తము నిబ్బరమొత్త నుండఁగన్॥ 80

మ॥ ఎపు డవ్యక్తకయానున ప్రకృతిబాహాస్ఫారమా? నామతో
నెపుడీసృష్టిరహస్యసంగతుల సందేహంబుల న్దీర్ప హ
స్తపుటి న్మ్రొక్కెడి వేడనానని మనస్కారంబు తొల్లింటియు
ట్లపమార్గంబున నన్ను నన్నువడకుండ న్నిల్ప భీష్మించుచోన్॥ 81

శా॥ ఎంతోదవ్వుననుండి నాదమొకఁ డాయీవైపునా కెల్లచో
నింతింతై చుఁ గ్రమాభివృద్ధి నొకమూరే హీనమంద్రంబు తా
నంతేవాసిగ నొంది నాదమధురవ్యాపారసంయుక్తి స
ర్వాంతర్యామిగ నామెతిల్లెనట కత్యాశ్చర్యశీర్యన్మతిన్॥ 82

ఉ॥ లౌకికనాదరీతిఁ జెవుల న్దవులొందువిధంబు సుంతయుం
గాక మదంతరంగమున గర్భమున న్బ్రభవించి చిత్రవ్యం
తాకసువర్తులాధ్యపరితఃప్రసరద్వలయైకదక్షమై
పోకెడునట్లు లెవఁ గడుఁజోద్య మటం చట వేచియుండఁగన్॥ 83

శా॥ "అక్కా! ఏలప్రబుద్ధఁ జేసెదరు నిర్వ్యాపారతన్ హాయిపె
ల్లుబ్బన్ మీరలు నిర్వికారులయి వన్నుండంగ నాకేటి కీ
తబ్బిబ్బు ల్పడ సృష్టికార్యపరతంత్రత్వంబులోఁ? జాలుఁ లెం
డబ్బే! ఊఁహుఁ! కయింతు మీ మొడఁదనే యేమాయెనా కేటికిన్?॥

చ॥ అనెడియుపహ్నవం బడరినంత నిదేమని యెచ్చులోన బు
ద్ధి నెగడె నర్థనారియగు దేవుఁడు నాఁదగునూక్తి [illegible]త్వపుం
స్త్వనియతి ప్రకృ-ప్రకృ-గ నెసంగక క్షీరమునీర మొందుమే
ళనమునసే పరస్పరమిళత్పరమస్థితి గా స్ఫురింపఁగన్॥ 85

మ॥ తొలిజామం దవబద్ధబుద్ధి కడుచిందుల్త్రొక్క నామూలుగు
న్గలక న్నయ్య విడంగలేనిగునుఫుంగాఁ దోఁచున వ్వార్త ప
త్రిలువెన్వెంటనె యెద్దియోయదురు పర్వెన్బెంగరా లుర్వడి
న్వలయుప్రోద్ధతి సంభ్రమించుపస లొప్ప న్మప్పారు లొప్పడన్॥ 86

మ॥ సతి యానారి మగండు మేలొనకమి న్నయ్యాస్థితి న్నీడుచు
న్పతిసంపాదితగేహకార్యకలనాబద్ధస్పృహా న్నెపక
ప్రతతి న్గూడి నిజేశసౌఖ్యకృషికి న్వాటంబుగా దిద్దు ప
ద్ధతి సంధిల్లఁ బరాప్రకృత్యభిద వేయుంబోలు ప్రారంభముల్॥ 87

శా॥ "ఔనక్కా! తెలవాఱలే దప్పుడె నీకాయాస మేలా సనః
స్త్రానేయంబులఁ గూర్చి లేపెదను పొమ్మా నిద్ర!" యం చొయ్యన
న్మ్రానంబో లపరాప్రకృత్యభిద మెల్బుద్ధి ప్రసంబొంది భూ
తానేకాంచితసృష్టికర్మ ననునట్లై వింత హర్షించుచున్॥ 88

మ॥ అదిరా! సత్త్వమహాత్వతత్త్వబహుళవ్యక్తిత్వ మడ్డే కళా
భ్యుదయత్వంబున వేముఖాలఁ బరమానందోత్పాదకంబై మహా
త్పదపూర్వంబగుబ్రహ్మనా న్బ్రసుఁగె నల్వంక ల్తఱియాఁ ఖసం

వద నిండించుటనే చతుర్ముఖుఁ డన న్వ్యాకొంట లాకైసరీ॥ 89

ఉ॥ లేకెడ మొంగు గ్రుక్కిడిలలి స్వరమాణువు లున్ననైనఁ బ్ర
త్యేకత యేనుమాత్రముగనే న్విలసిల్లెడునట్లుగాఁగ వేఁ
బోకలలో నహంకరణము న్విశదంబగు చుండఁ బత్తునుం
జేరగ మాత్రలైదు నొదవె న్స్త్రిమసంజనప్రణాళికన్॥ 90

శా॥ "మీరా గా! మీర! యొకింతనిల్చి నిజసామీచీన్యసంభావిసం
స్కారాదుల్విన గోరునాకు వివరింపన్లేర" యంచార్య నా
యారాటం బుడిపోవ సాజతసమూహాంబందు నేటానహం
కారంబేనియు బుద్ధియేని మనమే న్గైకొవు దాక్షిణ్యముల్॥ 91

ఉ॥ ఆదిమమైనశబ్ద మదయంబగు తోడనె యాకసంబు ను
త్పాదిలె స్పర్శతోఁ బొదలెవాయువు రూపముతోడ నగ్నిహో
త్రోదయమేర్పడె న్రసముతోఁ గలిగె న్జలనామకంబు నా
మోదమెసంగ సంభవిలె భూమి యనందగుభూత మొప్పఁగన్॥ 92

ఉ॥ ఆపరమాత్మచోదన కనంతర మాప్రకృతిప్రబోధ కా
యూఁపున నొమహద్విథికి నుబ్బునహంకృతికి న్నడాన నే
యేపన నెంతకాల మెడమేర్పడెనో యనిపించు వాస్తవం
బోపియెఱుంగ నీయఖిల మొక్కతటి న్బఱపాట తెల్లమా॥ 93

చ॥ ముడిసరు కందునట్టిడి చము ర్విడఁగూర్పఁగ సంధిసీమలం
దడరనొనర్చి కేల్గిఱప యంత్రము సాగి నువస్తుసంతతు
ల్తుడుమలుగాఁగఁ గూర్చులలితో బహుమూలపరాత్మఁ దోడుచు
న్దొడరెఁ బ్రధానమన్గుఱుతుతోఁ దగుమాయ ప్రకృత్యభిఖ్యమై॥ 94

ఉ॥ తా జడమాట నీప్రకృతి తజ్జడిమాన్వితమూలపాళిపై
మోజున వానినే కొనుచు మున్మును గొల్పెను సృష్టి యెల్లెడ
న్రాజిలు నాత్మవస్తుపరిణామతఁ గొల్పదు జీవసృష్టిఁ ద
ద్భోజనయోగ్యమున్నఁగద పుట్టఁదగు న్బహుజీవసంతతుల్॥ 95

ఉ॥ ఆపరమస్వభావకళ నప్పుడె యంటఁగనేల నాఁగఁ దా
నే పలుపోకలం దిటుల లోలుపమై జడరూపసృష్టి యే
యేపసఁ బ్రస్తరింపవను వేర్పడు న ట్లపరాస్వభావ మా
రూపములెత్తెఁ దర్కమనిరూపణ మెంతు నొకింత నింతటన్॥ 96

—♦ సృష్టికిఁ బునాదులు ♦—

ఉ॥ మనము హావేలినో గుడినో మాడువునో తుడ కొక్కపూరియుం

టిని నిలుపన్దలంప, ధరణి న్గడుగట్టి లభించుదాఁకఁ బ్ర
వ్విసవయి, మేలిరా, ల్లినుక వేసిననున్నయొ, మన్నొ, వారిమి
శ్రేణముగఁ జేర్చి పేర్చిగద చక్కగవాడుకఁగొందు మందులన్॥ 97

ఉ॥ ఇక్కడ నామరూపరహితేశ్వరుఁడే యజమాని, మాయల
న్గక్కువరాపరాప్రకృతికాంతలెమా వనివాండ్రపెద్ద, ల
ష్కక్క మసూక్ష్మచిక్కసకణాకృతులేనుమి కూలినాలివా
రక్కట వట్టిబైలె తదసర్గళసర్గవిసర్గధాత్రియా॥ 98

గీ॥ మహదహంకారబుద్ధులు మనమున కగు
ప్రభవ మింతకె యనుకొనన్బడియెఁగాదె
పంచమం బగుభూతసంభవము నెల్లు
వరఁగనొ కొంతకొం తేఁ నెఱుగవలదె॥ 99

క॥ పంచమసర్గమునఁగలిగెఁ
బంచవిధములైనతత్త్వవారము తొలికా
న్పెంచగఁ నాకాశమ వ్యా
పించు న్యజమానియుల్లె విరివి నెచటనేన్॥ 100

గీ॥ ఎట్టిసృష్టిలేన పున్నవట్టిబయలు
వట్టిదనుకొంట కఁదుబొరపాటుమాట
వ్యాపకం బగుపరమాత్మవస్తు వందు
నిండిబిడీకృతంబుగా నుండియుండు॥ 102

క॥ అంతర్గుప్తములగుచుఁ
ర్వాంతి ర్వామియగుదాన నఖిలభవిష్య
త్పంతానతానకంబు ల
వాంతరసమ్మిళితగతుల నం దెపుడుండున్॥ 102

గీ॥ లేదు శబ్దంబు స్పర్శంబు లేదు లేపు
రూపరసగంధము లస్త్య మోపి తెలియ
నల్లనాఁ డున్న వట్టిబయంటఁ గానఁ
బూర్ణమాఁ బూర్ణమున్గా దభూతభూతి॥ 018

గీ॥ ఆకసము గాలి నిప్పు నీ రవనియొక్క
నూక్ష్మసూక్ష్మాణుపుంజ మచ్చుఁగొనెఁ గ్రమత
వీనిగుణములు క్రమవృద్ధి నెలయు ధ్వనియు
స్పర్శము న్రూపము రసంబు వాసనయును॥ 104

క॥ మొదలిగుణ మొకటి నింగికి
మొదటిరెండు గాలి కనలమునఁ దొలిమూడుం
బొదలున్నీటం దొలినా
ల్గొదవు ధరకో! గుణములయిదు నొనరి చెలంగెన్॥ 105

ఉ॥ కాల్చినకొంకి రాతి నుదకంబున వైచిన సద్దుసాగి పై
నిల్చిననీటిఁ దాఁకుచు ధ్వని న్నెడగ ల్మొలిపించి సున్నపూ
పెల్చన వట్టిబైటి నడివీధుల భూతకణా క్రమంబుగా
మొల్చె వియత్తుదొట్టుకొని భూపదసూక్ష్మముదాఁక దేఁకుచున్॥

క॥ పంచమసర్గం బగునల
పాంచభౌతికంబుఁ బెఱుకవలసి కదురలా
యించితిమి దవ్వు నొక్కటి
నుంచి మఱొం డెట్లుపుట్టెనో కనవలదే॥ 107

శా॥ అవ్యక్తం బపరాస్వభావమున సూక్ష్మాణుప్రపంచంబు ల
త్యవ్యస్తస్థితి నుండి యాకసము సజ్జంబౌటకో నొంకృతి
న్నవ్యక్తంబులుగాఁగ నొండొకటి గ్రొచ్చుస్వచ్ఛ్రంబుంగా నమ
తవ్యప్రోద్ధతి రోదసి న్వాలయు చందం బట్టి వీక్షించుచున్॥ 108

క॥ "మీ రెవ్వరయ్య? భగవ
త్ప్రారంభులో? కారో? ద్విస్వభావజనితులో!
యీరీతి నసంఖ్యాకతఁ
బేరంబుల హేతు వదియొ? వినిపించెదరే?" 109

క॥ అని యడుగఁదలఁచుకొనులో
నన నంతకుఁ జిన్నవరుకణంబులు ద్రవి
ప్పునఁ జెలఁగి మొదటివగువా
నిని జుట్టిభ్రమింపసాగె నిస్తులర్ఘురితోన్॥ 110

ఉ॥ ప్రాథమికంబు లౌటను బురాతను లామొదలింటి వంచు సం
శోధకసూక్ష్మజాతములు రూఢిగ నూతనులంచు నొక్కసి
ద్ధాధకసంజ్ఞ చిత్తమున బట్టఁగ నమ్మియి నిర్ధరించి యా
సాధనతోఁ బరీక్షకు నెసంగితిఁ బొంగుకుతూహలంబునన్॥ 111

క॥ ఆలోన సవ్యవిద్యు
ద్వ్యాలంబితసూక్ష్మకణము లావిర్భాతిన్
మేలుకొని పైద్వయుంబుల

తో లగ్నంబగుచు ముద్దఁదోడుగుటఁ గంటిరే॥ 112

క॥ నూతనములు సత్వవిద్యు
జ్జాతంబులఁ గలియు రెంటిసంబంధముతో
నేలీలననో మొదటిపు
రాతను లంతర్ధినొందె రాద్ధాంతముగన్॥ 113

ఆ॥ కరిగిపోయె ననుటకంటె నీరెండింటి
కలుపుతోడ సిద్ధిఁగాంచుగుటిక
నాపురాతనం బటంచు నెఱుంగుటే
సత్యమనుచుఁ దోఁచె శాస్త్రగతికి॥ 114

క॥ కావున నిప్డు పురాతను
లో వెలసెడి నూతను న్గొలుచు సత్వము నే
యేవైఖరి వనియెఱుఁగం
గావలసె ననంతరములకంటె నిజార్థిన్॥ 115

గీ॥ ఇట్టి సూక్ష్మాలలో నింక నెవియొ గుదులు
గాగమాయగఁ దెలగుట గాంచి పోల్ప
మాయనులు పోషణులు నింక మఱియుసూక్ష్మ
తరము లెన్నొ ననంఖ్యాకనిరతిదోఁచె॥ 116

గీ॥ తనుగుఱుత నిచ్చుచుండునూతనుఁడు సత్వ
విద్యుదాకర్షణతఁ గనిపించు సత్వఁ
డీద్వయాప్తిఁ బురాతనుం డెసఁగుచుఁ గణ
గర్భమనుసంజ్ఞఁ గైకొని గ్రాలుచుండు॥ 117

శా॥ ఈనిర్ధారణ కేను రాకమునుపే యింకొక్క-సూక్ష్మాకృతు
ల్తో నద్భ్యాతిసి రేఁగి ముట్టసిగ నెంతో తీవ్రవేగం బునా
దానింపంగఁ బురాతను ల్దిగువ నాదాఁపొంది నాలిఁడు వీ
లైన స్మృత్తిఁకఁ జుట్టుసట్లు పరివేషావేశత స్సాఁగిరన్॥ 118

ఉ॥ గర్భములోని సత్వమునకై యివి పర్విడుచుంటఁ జూచి సం
దర్భము నెన్నయెన్న మదిఁదట్టె నొహో! యుపసత్వవిద్యుదా
విర్భవ మిచ్చుసూక్ష్మములో! పీఁకి సత్వములందు నెంతగా
దుర్భరమైనప్రీతియొ! యెదుర్కొనఁబోయెడి! నేమియూనకో॥ 119

చ॥ అని కనిపెట్టియుండ దరియ న్వడిఁతోడుతఁ బోయిపోయి యుం
తన రొఱుకొంతయూఁతొడమునన్ గదుకొంటను మాని నూత్యమే

నున బడ కంతరాంతర మనుద్రవతయుక్తి గ్రహాళి సంభ్రమిం
చునియతితో భ్రమించుటను జూచి వినోదవిఘూర్ణితాత్మతన్॥ 120

క॥ సవ్యాపసవ్యముల కెపు
డవ్యాహతమేళనం బటంట వితయె? యే
లా వ్యవధికల్గ నిటు లవ
సవ్యము బిఱుతివక తిరుగసాగెనొ యనుచున్॥ 121

క॥ సందేహము డెందంబును
గొందలమునదింప "వేగగుణ"మది యను మూ
ర్తిం దెలిసి ప్రకృతిమాయా
స్పందనముల చిత్రములకుఁ బర్వముఁగొంటిన్॥ 122

మ॥ ఘనవేగంబున సంభ్రమించునొకచక్రం బంట రాముక్క రు
ద్వినచో నాకులసందు దూఱి చన, కావేగాన సర్వత్రఁ గ
మ్మినయ ట్లైకతఁ దోఁచునాకులవాతి న్మిట్టునదా! అట్లె గ
ర్భనియుక్తం బగుశక్తి లాగ దపసవ్యంబున్ బ్రయత్నించియున్॥ 123

క॥ అపసవ్యనూత్నకణ మి
ట్లెపుడున్ది రుగాడునాట హేలాతనుగా
నుపనామమునకుఁ దగియెడి
విపరీతపరిభ్రమాప్తి విడువక తిరుగున్॥ 124

మ॥ ఒకగర్భంబున కొక్కహేల యనగా దుంచుండుఁ దొంబదు సం
ఖ్యకునేర్పించి, యిటెన్నియున్నను దదీయాక్రాంతులం దెందు నొం
డొకటి న్దాఁకవు. దైవమాయ! కన నెంతోచోద్యమా! వేగ మిం
చుకయున్నాఁజదు, తద్గురుత్వమున, గచ్ఛన్విచ్ఛఁగాదింతయున్॥ 125

క॥ హేలాయుతముగ రోదసిఁ
దేలెడిగర్భమును బోల్చి తెలియఁ గణముగా
మేలగును బిలువగా, నీ
లీల న్ద్వానవతిగా ఫలించెన్గణముల్॥ 126

క॥ తొలిగర్భావిర్భూతులు
కలుగఁగ నొక్కొక్కహేల కదియ ననిలజా
తుల కాది యయినయదజని
వెలయఁదొడఁగె వ్యోమభూతవీధులలోనన్॥ 127

క॥ మును పున్నధ్వనికి సంతట

నెనసెఁ స్పర్శయును గాన నీరెండిటితో
ననిలం బంతంతకు వడిఁ
గొనసాగె నిత స్తతఃప్రకోపితగతులన్॥ 128

క॥ ఉరువునకుఁ బ్రాతిపదికగఁ
బరఁగెడి యుదజనికణం బవశ్య మొకటిగా
నరసికొనఁ, బెఱలసాంద్రతఁ
దరతమముల లెక్క కనువు దర్శింపనగున్॥ 129

గీ॥ ఉదజనికణంబు నొకటిగా నొప్పికొనిన
బదియు నెనిమిదివందల్పైని నలుబ
ది యగువంతంగుళంబున న్దివురు హేల
గర్భము స్కంద మనిపించుఁ గడమయెల్ల॥ 130

క॥ హేలకు గర్భంబునకు
న్జాలయెడంబుండు, సూర్యునకు వరుణునకు
న్బోలినతావేలున నీ
ఖాళీ పో న్గర్భగురుత గమనింపఁ దగున్॥ 131

గీ॥ అంగుళములోన శతకోట్లయంశమావె
హేలవ్యాసంబు, నది పఱఁగ త్రైశివడిఁ
గనఁగ నిర్వదివేలమైళ్లను నతిక్ర
మించు సెకనొక్కటికి భ్రమియించుపోక॥ 132

గీ॥ ఒక్కకణగర్భమును జుట్టుచున్న హేల
లను ననుసరించి వివిధానిలములు పొలిచెఁ
దత్పరిభ్రమణోగ్రత న్దనరెఁ గాఁక
శబ్దమును స్పర్శమును రూపు సంక్రమింప॥ 133

క॥ కలిగినయనలము వేడిమిఁ
జలనత్వర హెచ్చుకొలఁది సరభసముగ హే
లలు గర్భములను డాయుట
కలిగెన్ద్వ్యాసవతి దాఁటఁగ న్గ్రిమయుక్తిన్॥ 134

క॥ ద్వ్యానవతిగతులఁ గణసం
తానం బన్యోన్యమేళనములకుఁ దొడర
న్బానఁగ ననిలము లెన్నో
తో నుద్భవమొందెఁ గ్రమముతో విమశీథిన్॥ 135

గీ॥ గర్భమును హేల లెనిమిది కదియులోన
ప్రాణవాయుసముద్భూతి పరఁగె మింట
నంత నీప్రాణ ముదజని నలమఁ గలిగె
శబ్దమున స్పర్శ రూపరసముల జలము॥ 136

గీ॥ శబ్దమును, స్పర్శ, రూపరసములు గంధ
మొప్ప నంతంతఁ బృథ్వియు నుద్భవిల్లెఁ
బహువిధములుగ గర్భసంబద్ధహేల
లెన్ని అన్నిరకమ్ముల కనసికొనుచు॥ 137

క॥ తొంబదిమూఁడుగ నిట్టుల
నింబుగొనుపదార్థజాల మెల్ల భువనజా
లంబులకు మూలములుగా
సంబంధపరంపరాప్రశస్తి నెలఁగెన్॥ 138

—♦ వెలుగుమబ్బులు (Nebulae) ♦—

గీ॥ ఇన్నిరకముల బుట్టినయెల్లకణము
లంతరాళాన దిరుగుచు నణఁగిపెనఁగి
తుడుములై మబ్బులై బిట్టుగ్రోసికొనుచు
రాపిడి గ్రేఁగుననలాన రాజిలంగ॥ 139

క॥ వాయుద్రవఘనరూప
జ్ఞేయంబులుగాఁగఁ దోఁచకే జ్వాలదనిల
ప్రాయమ్ములై యురువాతో
న్నాయతఁ దిరిగె న్నభంబునన్ స్వేచ్ఛమెయిన్॥ 140

సీ॥ గర్భంబు నొకహేల కదియంగ నుదజని
యమళమైన హీలియమ్ము నయ్యె
మూఁడైన లితియు మిమ్ముకొనె నాల్గైదింట
బెరిలియం బోరను న్బరిఢవిల్లె
నాఱేడునెన్మిది నంగార నత్రజ
ను ల్ప్రాణవాయువు న్గొనె భవంబు
నవదశైకాదశాన నగ్గె ఫ్లోరె న్ని
యా న్సోడియం బనునట్టిమూఁడు
పదియుకొంట మగ్నీషియం పదియుమూఁట

నల్యోమినియము నవతార మందె జగతి
నిట్టి యేకో త్తరపువృద్ధి హేల లెనయు
వస్తువులు ద్వానవత్కి పై వఱలఁదొడఁగె॥ 141

క॥ ఈవస్తుసమితిభారము
లావిష్కృతమూలతుల్య లగునిసటోప్సు (Isatop s)
ల్సేవింపఁ దగును గృతితుదిఁ
గావింపంబడెకివట్టిక న్వివరముగన్॥ 142

క॥ మిన్నెల్లఁ గావిరి న్సం
ఛన్నంబగునట్లు భూతజాతము కడుదీ
ప్తి న్నిగిడి వడులనడుపున
మిన్నేరన మూగి పఱచు మెలపులలోనన్॥ 143

క॥ ఆపోబడి బిట్టుబికెడి
త్రోపులనే న్దహనపవనధూననమునవే
న్మాపుకొనవు సాజములగు
నేపుల భ్రమణముల గర్భహేలావితతుల్॥ 144

గీ॥ గర్భ మాత్మప్రదక్షిణగతిఁ దొలఁగదు
హేల గర్భప్రదక్షిణావృత్తి విడదు
ఇట్టిచలనాలతో నె మిన్నే టిరుగుగుల
దేలిపోవుచునుండు నందేనిబయుల॥ 145

క॥ సవ్యాపసవ్యవిద్యు
ద్ద్రివ్యమునూక్ష్మకణభవముతఱినే తద్వ్యా
హావ్యవధి యుఃకిగాఁగొని
సవ్యత్రాణంబు లమరెసరిభసగతులన్॥ 146

క॥ అపసవ్యసూక్ష్మకణముల
కుపమింపఁగ నైనవగుచు నోకములన నూ
టిపయి నైదువది రె
ట్లుపరిమితి దళసరి యేర్పడ న్గనియించెన్॥ 147

క॥ సవ్యాపసవ్యములగుది
నవ్యావాలి నందునందు నంటఁదిరుగుచు
న్నవ్యకళఁ గూర్చునోకము
లవ్యస్తవ్యస్తచలన మనుగతుల నిడన్॥ 148

క॥ జోడగుసర్గ మయోనులు (Ions)
తోడుగ నపసవ్యముల కెదురు సరి నడక
న్గూడుకొని సవ్యముల నా
డాడ న్జటలుకొని పఱచు నందందు వడిన్॥ 149

గీ॥ చూడ నపసవ్యమధ్యస్థసూక్ష్మకణము
లమరు దళసరి నొండొంటిసమములగుచు
వానిశక్తులును స్తుల్యబలము గలవె
కాని విపరీతవిద్యుత్ప్రకాశకములు॥ 150

క॥ మనసూర్యగ్రహచక్రం
బున సూర్యునిజుట్టి యెట్లుపోవునొ గ్రహము
ల్చను నట్లు గర్భసూక్ష్మం
బును జుట్టి తదన్యసూక్ష్మము ల్నిరతంబున్॥ 151

మ॥ కణగర్భంబున నిన్నిసూక్ష్మకణము ల్గాోలున్గదా! వీనిచేఁ
గణకాయం బదియెంతపెద్దదియొ! నాఁగాఁ దోఁచఁగావచ్చు మా
ర్గణము న్జేయఁగ నట్లుకాదనుట నిర్ధారింపనౌ నద్భుతాం
గణ మిట్లన్యమెసంగ దావెలయుమందంబు ల్కడుసూక్ష్మముల్॥

వ॥ ఒకయుదజనివాయుకణమున సవ్యమధ్యస్థాదిసూక్ష్మకణపుంజ మొక బొడ్డుగా (గర్భముగా) నుండ దానింజుట్టి తిరుగుచుఁ బదార్థసహజ సంఖ్యగా నుండునపసవ్యకణములు తమతమ ప్రత్యేకపరిధులలోఁ దిరుగుచుండును. వీనిలో నొకొక్కదానివ్యాసము భూతదర్పణం బున (అద్దమునం) బరిశీలించి కొలువఁగా నొక యంగుళమున 0000000000014 భాగముగఁ దేలినది. కణగోళమునడుమ నుండు సవ్యసూక్ష్మకణాదిపుంజము(గర్భము) దీనికంటెఁ జిన్నదిగనుండును. కాని యుదజనికణవ్యాసము (అంగుళియలో 1700000000) పై యపసవ్యసూక్ష్మకణ (హేల) వ్యాసముకంటె 85000 రెట్లెక్కుడుదిగ నెఱుఁగఁబడును గావున గర్భమునకును దానింజుట్టితిరుగునపసవ్య సూక్ష్మకణమున(హేల)కును మధ్యమునున్నయెడ మపసవ్యసూక్ష్మ కణవ్యాసముకంటె 17000 రెట్లుగా నగుపడఁగలదు ఈసూక్ష్మకణ ముల మందములనుబట్టిచూడ నీయెడము చాలవింతవిరివి కలది యనుటకుసందియమా! అయినను 9.29.00000 మైళ్ళదవ్వునను ండియు మనభూమి ప్రభవకాలమునఁ బనువడినస్రోవ నేమాత్రముం

ద్రోలఁగల సూర్యుని విడువక యెట్లుతిరుగునో అట్లే యపసవ్యకణములు (హేలలు) తమదారులందప్పక గర్భమున్విడువకయే దానిం జుట్టి పరిభ్రమించును. దీనికేమికారణమనినచో - సూర్యునకు భూమికి నున్నలాగుడుశక్తులవలెనే యపసవ్యసూక్ష్మకణముయొక్క- యపసవ్యవిద్యుచ్ఛక్తి గర్భములోని సవ్యసూక్ష్మకణముయొక్క- సవ్యవిద్యుచ్ఛక్తియు నన్యోన్యాకర్షణముల సమకూర్చుకొనుచుంటనే యని తెలియును. ఎన్నియపసవ్యసూక్ష్మకణములు గర్భముంజుట్టి తిరుగుచున్న నన్నిసవ్యవిద్యుత్ప్రసారకములు గర్భస్థసవ్యసూక్ష్మకణమున నుద్భూతము లగుచుండును. కాని కణగర్భమన్నిసూక్ష్మములగుదియని యనలేము. చుట్టుదిరుగుహేలలసంఖ్య యెదిగిన కొలందిగర్భమందలి సూక్ష్మములసంఖ్య నెదిగించుకొనును స్వభావ మాహాత్మ్యముగర్భమునకుం గలదనిపించును.

గీ॥ ద్రవమొ ఘనమొకో- గర్భవాస్తవ మటన్న
కాదు వాయుపుంకంబె నాకసముకంబెఁ
బల్చనగఁ దోఁచు. వెల్పలిభాగ మెపుడు
మాఱుచుండు నెన్నెన్ని యోతీఱుబడుల॥ 154

— కణసంఘములు —

గీ॥ ప్రభవమొందినయాకణప్రచయమెల్ల
మింటఁ బొగమబ్బులుగ వ్యాప్తిమెలఁగుచుండ
లోనితిరుగుడువడులకతానఁ బ్రబల
ఘనతారాకర్షణముల సంఘములుకట్టె॥ 155

క॥ ఈసంఘములంతఃకణ
భాసురచలనంబుఁ దమకుఁ బ్రాప్తింప నుడు
ల్గా సంభ్రమించె గోళము
లై సురలై సంతతప్రయత్నము లెసఁగన్॥ 156

చ॥ చలనముతోడ వేఁడిమియు సంభవమై కణఘర్షణక్రియ
న్వెలిసి మహాగ్నిగా వెలయుపట్టులలో కణగర్భసంస్థల
న్విలసిలె మార్పులు న్గలుపువి స్ఫుతు లత్తటి నుద్భవించె గా
లులు తమతోంటిసూక్ష్మకణలోలత లేక ముఖంబుఁ గైకొనన్॥ 157

ఉ॥ గాడుపు లట్లుకల్గ బొలిగా జనియించినయగ్ని పోషన
న్దోడనఁ దోయతత్త్వములుఁ దోఁచెఁ గ్రమజ్వలనాభివృద్ధిచే

రాజహంసము, నరకాసురీయము, వైణికము, శ్రీమహావిష్ణుకము, సారథికము, మౌక్తికము, నౌకావృష్టము, సోమకాసురీయము, వద్రికము, సానుమంతము, జాలరికము, శరాలికము, బాణాసురీయము, క్రౌంచము, మత్స్యరాజీయము మాయూరకము, నార్గము (నృగమండలము), ప్రోష్టాష్టకము, గారుడము, మొదలగునవి మూడువేలలక్షలకుమించి కలవు

క॥ ఇవిగాక పెనువెడల్పున
ఙివిలెడిక్షీరాధ్వమందు మెలఁగెడి తెంపు
స్సవురుల మండలములుగా
నవుపించు ననేకములు క్రమాంతరగతులన్ ॥ 174

— ♦ నక్షత్రములు ♦ —

శా॥ సంకోచించెడివెల్గుమబ్బుల బహిర్జ్యారేఖఁ బ్రత్తిప్రత
న్గొంకు ల్వీడినలాగున న్వడలుచు న్గోటానకోట్లొచు న
ల్వంక ల్మేలివిహారసీమలుగ సంబాళించుకొంచు న్నిరా
తంకోత్క్రాంతుల రిక్కలొప్పె బహుళోద్యద్భిన్నభిన్నాభలన్ 175

క॥ రాతిరి నేతటి జూచిన
జాతర నూతముగ మూఁగు జనతతిగతి న
క్ష్వాతం బాతతసంఖ్యల
ద్యోతిలు వేతరము ప్రభలఁ దొడరెడికడఁకన్॥ 176

క॥ నలుసున కర్కున కురువునఁ
గలభేదముకంటె మిగులఁగలవ్యత్యాసం
బులతోడఁ దరతరంబుల
కొలఁదుల రిక్కలు నభంబుఁ గొలుచుచుఁ జెలఁగున్॥ 177

ఉ॥ కన్నునఁ జూచి లెక్కయిడఁగాఁ జనకున్నను దూరదర్శని
న్దిన్నగనారయ న్గణనతేలు నభంబున నున్నరిక్కలం
దెన్నఁగనైనవెన్వియుని. యిట్లుగణింప గణింప మూడుపై
మన్నల నేడకంబొ యిడఁ జొప్పడుసంఖ్య ఫలించు నూటిగన్ 178

క॥ ఏదూరదర్శనికినే
చ్ఛేదంబడరానిబయల జిగి దగదగల
న్మైదారిఁ దాటు నవియొ
వ్వో దేవునకైన నెఱుక యున్నదొ లేదో!॥ 179

ఆ॥ తరతక్రమానుసరణ సరివిడఁదీయఁగాఁ
దరముకాదు వీని; దవ్వు పెద్ద
చుక్క చిన్నదిగను జూడ దాఁపగుచిన్న
చుక్క పెద్దదిగను స్ఫుటముకెక్కు॥ 180

ఉ॥ ఐనను దూరదర్శిని సహాయముతోడఁ బరీక్షఁజేయుచున్
మేనులవార్ల వెంబడి గమించి గణించుచు నేర్పరింప స
త్త్యానకు దాఁపుగాఁగ విశదంబగు నిర్వదియొక్క మూకలుం
గానగునంచుఁ గానఁబడఁగానగుచుండెడుచుక్క లన్నియున్॥ 181

వ॥ మొదటితరగతి కిరువదియొకటియు రెంటికి నలుబదియొకటియు మూటికి నూటముప్పదెనిమిదియు నాల్గిటి కైదువందలముప్పదియు నైదిటికిఁ బదునారువందలయిరువదియు నారిటికి నాల్గువేల యెనిమిది వందలయేబదియు నేడిటికి మూఁడులక్షలయిరువది నాలుగువేలును .........పదునారిటికి డెబ్బదిలక్షలును......యిరవదింటికిఁ బది వేలలక్షలునుం దక్కనవియిరువదొకటికింగా మొత్తము 8000000000 లనియునుం దెలియఁగలదు. ఈతుదితరగతిలోనిచుక్కలలో భవిష్యత్పరిశోధనములలోఁ బైతరగతులకుఁ బోఁదగినవి యుండియుండనగు.

క॥ ఈనక్షత్రములన్నియు
భానుమూర్తులనుచుఁ దెలియవలయు నొకటి కె
న్నేనియుఁగ్రహము లుపగ్రహ
మానితంబు లున్నవో కొక్క మాంద్యద్గతులన్॥ 183

గీ॥ వీనిలోని జీవవితతు లెట్టివో? యెన్నో?
యెఱుఁగనట్టి వింక నెన్ని కలవో?
అన్ని కట్టుదిట్ట మమరించి నడిపించు
సూత్రధారి బుద్ధిసూక్ష్మ మెంతో!॥ 184

క॥ తొలితరగతి నిరువదొకటి
వెలయు నక్షత్రములు సువిస్తృతతనువై
చెలఁగు న్దరతమములు నీ
బలయుతములగూడఁ దటిచి వరికింపంగన్॥ 185

చ॥ మకరవిశాంతితోడ నువమాసము వెంబడి వీనిలోన వా
రనుగనిపెట్టి పట్టికనుఁ వ్రాఁయ నగస్త్యుఁడు మేటి శ్యానమం
చనఁబడు రెంట జ్యేష్ఠుఁడవు నాల్గురవాఁ డిక వందలుం దగ

| నక్షత్రనామము | మననుండి వెల్గుటేండ్లలో దవ్వు | రవికాంతి కన్నిరెట్లు | రవివడికన్న తోపోలిక రెట్లు | వరా అనుబంధము |
|---|---|---|---|---|
| 1 | 2 | 8 | 4 | 4 |
| 1. అగస్త్యుడు (Conopus) | 650 | 60,000 | 180 | |
| 2. ఋగుడు (Rigel) | 540 | 18 000 | 88 | |
| 3. అశ్వని (పెద్ద) (Beta Centarius) | 400 | 3,100 | 11 | ఎఱుపు |
| 4. ఆర్ద్ర (Betelgeause) | 90 | 1,200 | 290 | 240000000 మై |
| 5. శంతనుడు (Acharuar) | 66 | 200 | 4 | అడ్డగోలత |
| 6. బ్రహ్మహృదయము (Capelea in Auriga) | 47 | 150 | 12 | |
| 7. స్వాతి (Archerus) | 41 | 100 | 80 | పసుపుపచ్చ |
| 8. బ్రహ్మ (Vega) | 25 | 50 | 2 | ఊదా |
| 9. శ్రవణము (Altaers) | 16 | 9 | 1 | |
| 10. పూర్వశ్వానము (Procyou) | 10 | 5 | 9 | |
| 11. మృగవ్యాధుడు (Sirius) | 9 | 26 | 2 | తెలుపు |
| 12. అశ్వని (చిన్న) (Alpha Cmtarius) | 4 | 1 | 1 | |
| 13. జ్యేష్ఠ (Antares) | 380 | 4000 | 450 | యెఱుపు |
| 14. త్రిశంకు (Alfa Crux) | | | | |
| 15. విశ్వామిత్ర (Beeta Crux) | | | | |
| 16. చిత్ర (Spica) | | | | |
| 17. మఘ (Regulus) | | | | |
| 18. సాంబమూర్తి (Poelux) | | | | |
| 19. ఇంద్రద్యుమ్న (Formalhant) | | | | |
| 20. రోహిణి (Aldaberan) | | | | |
| 21. బృహచ్ఛ్వానము (Canes Major) | | | | ఎఱుపు |

మ్యా నునికి వెలుఁగుండ్ల రవి కున్నది కన్గొన వల్యతార్థమై॥ 186

ఉ॥ మానియొకెత్తు నాతనికమండలుపో నొకయొత్తు నాఁగఁ జె
న్నానితుఁ డౌనగస్త్యుగరిమ న్నిజ మెన్న విచిత్ర! మద్రిగా!
భానునికాంతి కాఘనునిభాస మిఁకెవ్వదివేలరెట్లు నా
లో నగువ్యాసమొక్కొ! మిగులు న్రవికిన్ మఱినూటయెన్నదిన్॥

ఆ॥ అతనికంటె ఘనుఁడె ఆచంటిమల్లన్న
యన్నతీతిపీనికన్నమిన్న
నడిమికొలతరవికినన్నూటయేబదిన్
వెలుఁగునాల్గువేలుతో లఁగిజ్యేష్ఠ॥ 187

ఆ॥ ఇనునియష్టకొల్తకిన్నూటతొంబది
రెట్లదయ్యె నార్ద్ర యెట్లొ కాంతిఁ
బదియురెండుమార్లవాటె మెండయ్యె సం
చొక్కశంక కల్గకుండఁబోదు॥ 188

మ॥ వెలుఁగున్నబ్బులనుంచి గ్రీలుపిదపన్ వృత్తాయతి న్పంకుంచిం
పులలోఁ గొన్నివిలంబసంబుఁ గొనుటం బోలు స్గహన్నిద్ధవై
వెలయు, న్దీనికి నార్ద్ర సాక్ష్యముగు దీప్తిన్నార లాయూయిచు
క్కల న్వాభావికసంపుటీకరణజాగ్రద్భ్యాతపణా నారయన్॥ 189

వ॥ ఈనక్షత్రములు తమతమస్థానములనుండి యున్నపాళమున మనకు ప్రదర్శించుచున్నకాంతిని దంతమాంసగ్గయించుతలంపున్న చోవాస్తవ సహజదీప్తులెట్లున్నను దౌలుత నార్ద్రతేజము నొకటిగాఁ గొలతకు మానముగా గైకొనిన చో నంతకంటె మనసూర్యునిది పదిరెండుకోట్ల రెట్లుగను, జంద్రునిది రెండుముప్పాతికకోట్లమడుగులుగను మఱి యారవతరగతిచుక్కలవి దాసిలో నూటి నొకవంతుగను బదునొకొండవతరగతివి నూట పదివేలవ తుగను బదునారవమెట్టునవి నూట పదిలక్షలవంతుగను బిదప నిరువదొకటపక్ష్యవి నూట పది కోట్లవంతుగను గనుపించును. 190

క॥ బడికంటికి నగటున నీ
యుమతతులన్నియుచు దెలుపు చుమటులఁ గానం
బడినను బలురంగులవని
తడవతడవ నెఱుఁగవచ్చు దాదాపుగనేన్॥ 191

క॥ తెలుపు న్బసిమియు నూదా

తళుకు న్నారింజవన్నె తద్దయు నెఱుపు
న్గలయువి యున్నవి పై నీఁక
నలుపువియునుం జెలఁగు నడుమనడుమ౯ భళి రే!॥ 192

గీ॥ పెద్ద వన్నెట నెఱ్ఱన న్వెల్గునవియె
మూఁడు వేలడిగ్రీలపై మొనయు వేఁడి;-
నీలిచుక్కలఁ బదిహేను వేలనుండి
కాఁక వెలయు ముప్పదివేలదాఁక దాఁకి॥ 193

ఆ॥ కాల మరుగుకొలఁది కాంతిలోన రంగు
మారుచుంట కలదు మఱలమఱల
రెండువేలయేండ్లు నిండ మృగవ్యాధుఁ
డెఱుపురంగు వీడి యెక్కెఁ దెలుపు॥ 194

ఆ॥ అటులె సింహరాశియందలి చుక్కలం
గొన్ని తెల్పుమాయ హొన్నకళను
పసుపునీనుజంటఁ బ్రథమ మాకులరంగు
నందుకొనియె నొకశతాబ్దమితిన॥ 195

ఉ॥ రెంటికి హెచ్చుదిక్కుల ధరించిన గుంపులవంకఁ జూడ మి
న్నంటిన యింద్రచాపకళయట్టుల చిత్రవిచిత్రరీతుల
న్గంటికి విందొనర్చు బహుకాంతుల మేల్మణిసంపుటీకృతి
న్దంటగఁ దేలు రాగిడిచున న్బనుదండకడింబా నాభ్బస౯॥ 196

క॥ చుక్కల నల్లవి కలవని
వక్కాణింపఁబడెఁ బైని వానిఁ గుఱిచి గు
ట్టెక్కరణినాఁగఁ గనుఁగొనుఁ
డిక్కడ సూచింపఁబడు నొకింతఁగ రక్తి౯॥ 197

మ॥ వెలుఁగున్మబ్బులు చింద మండుచు దివి న్వేలాది వ్రేలాడి వె
ల్పలిజ్వాల ల్సమియింప లోనియుడుకుల్చల్లాఱఁ దొల్లింటివె
ర్పులు నీలాలుగఁ దెల్పుఁ బచ్చనలఁ దోపుం దేజరాగ్రా స్తుది
న్వెలయు న్జుక్కలు కొన్ని కాలుసలు హావేశింప నందంబులౌ॥ 198

ఉ॥ నల్లనిచుక్కలుండుననిన న్బరిహాసపుసోదె కాదు రా
జిల్లును వెల్గుమబ్బునదిసీమల నల్లనిమేఘపాళులు౯;
గొల్లగఁ బాలత్రోవఁ గనుఁగొనఁగ, లక్షల, నల్లచుక్కగుం
పల్లినమేర లెన్నో; మఱి యాకస మ్మప్రభలేనిదేకదా!॥ 199

క॥ అతిన, మండెడి చుక్కలు
తోరముగా వెలువ బయులఁ దొట్టుకొని యెదో
తీఱగుదువ్వ సుసూక్ష్మ
సారంబుగ నిండియుండు జర్జరితదశ౯॥ 200

గీ॥ పిండిజల్లెడకంతలే పెద్దలనఁగ
నొండొరుల కొనడాలు సూక్ష్మోపమేయ
ములుగ నంచెలునంచులై కలియునటుల
గానఁబడుఁగద నింగిఁజుక్కలు దళముగ॥ 201

గీ ఎడములింతేన! కవియుటెందేనిఁగలదె?
యనెడిశంక సాజంబుగా నెనయవచ్చు
ప్రకృతిగారడి కనుకట్టు వాస్తవమున
కెడము లతిదీర్ఘములుకల్లు లెందదరవు॥ 202

ఉ॥ దూరపుగొండనున్నృ, దఱిఁద్రోవలు గుండ్లును గండ్లుకాదె యా
తీఱునసే, సుదూరమున దిర్గుచునుండుట, రిక్కలట్టులే
మీఱుటెగాక మందముల మిక్కిలిచిన్నవిగాఁగఁదోఁచు, నీ
ధోరణి దూరదర్శనులతోడ కనుంగదు తేటనొందెడి౯॥ 203

క॥ వేయిధరలే న్బృహస్పతి
వేయిబృహస్పతులినుండు వేయియినులపా
టాయూడాచుక్క!ఇవియు
వేయి యెత్తుచుక్క సుమ్మి వివరింపంగా౯॥ 204

క॥ అడుగులు గజములు మైళ్లా
మడ్లైన న్నెలుఁవఁగాదు మఱియెడముల లె
క్కడ వెలుఁగు టేండ్ల మానమె
కడుయోగ్యము దానిఁ బలుకఁగాఁ దగు నిచట౯॥ 205

క॥ పదకొండున్నూర్లయడుగులె
గద ధ్వని సెకనునకు నడచుఁ? గాంతియొ నూటె
న్బదియారువేలమైళ్లో
ప్పిదముగ బరుఁగెత్తుఁ బ్రకృతివిధి సెకనునకు౯॥ 206

చ॥ సెకనున కిన్నిమైళ్లయుఁ బిచేఁ జనుకాంతి యొకేటిలోన న
న్నికనిఁక నెన్నిమైళ్లు గమనించునొ? ఆకాలమొత్తము న్గ్రహిం
చుకొనిన నంతదవ్వవను జూడఁగనయ్యెడిదిక్క వెల్గులే

టేఁకొనఁ గలట్టిదం మను ఘటించుకొనందగు మానమిందులకా॥ 207

ఉదా= 186000 × 60సె × 60ని × 24గ × 365 రో = 5,865696,000,000

మైళ్లు=వెల్గుటేఁటికొల్త

ఉ॥ అన్నిటికంటెదగ్గఱగనయ్యెడిప్రాగ్రిమ*(Pragrima)నామభాస్కరుం
డున్నప్రదేశమే యిచటి కున్నది నాలుగువెల్గుటేండ్లపై
నన్నినెల ల్గొన న్గలుగునంతయెడాన ననంగ మింట నే
తెన్నున రిక్కలెట్టి ప్రహతి న్నిహతి న్గనవంట చిత్రమే?॥ 208

* అశ్వినీసమూహామునొకటి.

ఉ॥ లోగడపట్టిక న్గన వెలుంగిడుచుక్కల దవ్వు కొంతయీ
లాగని బోధయాంగద! కళన్మొవగాఁడగునయ్యగస్త్యుఁడే(Cauopus)
ద్యోగతి మట్టుతార్థ మనొప్పెడినంతటి వెల్గుటేండ్లపై
భాగమునందుఁ గాదె కనుపట్టు నటంచును దెల్పఁగాఁబడెకా॥ 209

వ॥ ఇదియొకవింతకాదు. వెల్గుమబ్బులలో నొకటియగు నంద్రమేధ (Andrsmeda) యనునది మనకు 50000 వెల్గుటేండ్లదవ్వున నున్నదనియు దానియొకవైపునుండి యెదుటివైపునకు నూటిగఁ దాటుటకు కాంతికిరణమునకుఁ దొమ్మిదిలక్షల కాంతిసంవత్సరములు పట్టునవుటయు మిక్కిలివింతకదా! మనపాలత్రోవవంటివై పాముమెలికల యునికిని మఱియొక కాంతిపుంజము మనకెనిమిదిలక్షల యిరువదియైదు వేల వెల్గుటేండ్ల యెడమునం దుండుటయు, నిట్టివే పలుదూరములఁ నిఁక నిరువదిలక్షలవఱ కున్నవనియు వానిలోఁ గొన్నింటినుంచి కిరణము మనకుఁ జేర నొకకోటి నాల్గువందల యిరువదిలక్షల కాంత్యబ్దములు కావలయుటయు తెలిచఁ దలిచ నిట్టివే 5,000 000,000ల కాంతివత్సరముల యెడాన గోచరింపఁగలవనియు వినిన చో నిన్నింటిని దనయంతరాళమున నెట్టిసంఘర్షణములకు చోటీయనివై శాల్యమునో నున్న యాకాశముయొక్క యడ్డుకొలత యెంతయని యూహింప నగును! చదువరులే యూహించుకొంద్రుగాత!

గీ॥ శూన్య మాకస మనిపించుఁ జూడఁజూడ
వెలుఁగు ప్రసరించుటకు వీలు కలిగియుంట
నిక్కముగఁ గాదు శూన్యంబు నికరమైన
శక్తి యెయ్యదియో యం దెసంగుచుండు॥ 210

సీ॥ అంతరాళానఁ దత్పరివ్యాప్తి యొక్క

నడికొలత వెల్గుటెండ్లలోన న్వాచింపఁ
దెలిసి నరువదివేలలక్షలకరువని
పెటుఁగు నిది త్రుటి నలుబదివేలమైళ్లు॥ 214

గీ॥ ఇట్టివలయుంబునకు వెలిపట్టు శూన్య
మనుటకైనను నీ లింతయైన లేదు
వేలతరబడిగా నంతరాళ చయము
లవ్వలఁ లేనినిశ్చయమైన గలదె? 215

శా॥ ఈదృగ్గోళచయంబు లెన్నియొ విలాసేచ్ఛ న్సృజింపంగ నే
దాదక్షత్వముతో నెసంగునెదియో యంతఃప్రవాహాకృతి
న్బాదై యుంటె నిజంబు; దాన నెగడా! వాఙ్మానసాతీతమ
ర్యాద న్డండముఁ బెట్టి యేటికి నవాచ్యం బందు రద్దానినిఁ॥ 216

క॥ పురుషోత్తముఁ డాతఁడె య
క్షరుఁ డవ్యక్తుండు నయి వెసఁ క్షరసంజ్ఞ
స్ఫురఁగి యతఁడే తదంత
శ్చరశక్తి న్బంచభూతసంసృతిఁ గొలుపుఁ॥ 217

క॥ ఆ కార్యక్రమమున ము
న్నాకాశం బంతరాళ మంతట వ్యాప్తి
న్బ్రోకెడి స్వభావ మమర
న్జైకొని సంభవిలఁదొడఁగెఁ జిత్రోద్గతులఁ॥ 218

ఉ॥ అట్టుగ నంతరాళగతి నందిన యాకస గోళరాజిలో
నెట్టన నొక్కటై మనజనిప్రకరంబులకెల్ల మూలమై
పట్టగుదాని యడ్డకొల పైవిపరిఁచుటయయ్యె, దానిలోఁ
బుట్టినచుక్కలు న్ధనుములు ననినారము కొంతకొంతగఁ॥ 219

క॥ సవ్యాపసవ్యవిధ్యు
ద్వ్రివ్యము నిద్రాణుగతి నిరంతర మాకా
శవ్యాప్తి నుండి తఱిగా
న్నవ్యక్తతఁ జీలు వస్తుశుభయోగములఁ॥ 220

గీ॥ ఆదితత్త్వపరామర్శ మంతొ యింతొ
సలిపికొంటిమి యిఁక భూతచయములోనఁ
దాఁ ద్వితీయమెయి య్యు నద్వయమహాగ్ర
తాప్రభాయుతవాయుతత్త్వంబుఁ గనుము॥ 221

## —♦ వాయుతత్త్వము ♦—

గీ॥ సర్వసూర్యపురాతనజాతగర్భ
మొల్లసిలతుల్యదశ వహియించి సంత
తంబుదిరుగునో ఆత్మప్రదక్షిణములఁ
హేలలెటుదానిచుట్టుఁ బోయెడినో దరిసి॥ 222

క॥ హేలాసంఖ్యానుగతుల
నేలాగున వాయుజలమహీతత్త్వములు
న్నాలుగ ద్వానవతిపటిమ
దేలునో వివరణము కొంత తెలుపఁబడె గదా 223

క॥ ద్వానవతివస్తుసంఘము
లో నున్నే ముందు వెనుకలుగ జననదశలే!
గా నెఱుఁగవలదె? తగు, న
ట్లైన న్దొలిప్రళయచలనమం డది వశమే॥ 224

గీ॥ ఒకటిమాత్రము రూఢియా నుదజనికణ
మాదిఁ గల్గినదనఁ, దదనంతరమున
ముందువెన్కలు యుగపత్ప్రభూతులుండు
సంకలోద్భటసహితాద్యచాలనముల॥ 225

క॥ కలిగె న్హేలానుగతి
న్బలు తెఱఁగులవాయువు ల్నభంబున నాయా
కలరూపము లేమూకల
ముల లేవని రూఢిఁ దెలియ ముఖ్యము కనవో॥ 226

వ॥ ఒకటే హేల గర్భముంజుట్టి తిరుగుచున్నచో నుదజని వాయుకణ మేర్పడును. రెండైన హీలియము నేడైనన్త్రజని యెనిమిదియైనఁ బ్రాణవాయువు దొమ్మిదియైన ఫ్లోరైను బదియైన నియాను బదునేడైన క్లోరైను పదునెనిమిదియైన నార్గను ముప్పదియైదైన బ్రోమైను ముప్పదియారైన గ్రిప్టను నేబదిమూడైన నయొడైను నేబదినాల్గైన క్షేనాను మొదలైనవి యేర్పడును. మనము మామూలుగ వాతావరణ మనుకొనునట్టి వాతమున నూటడెబ్బదియెనిమిదిపాళ్లు నత్రిజనియు 21 పాళ్ళు ప్రాణవాయువును, 0.94పాలు ఆర్గను, 0.03 పాలు బొగ్గుపులుసుగాలియు 0.0018పాలు నియాను, 0.0005పాలు

హీలియము, 0.0001పాలు క్రిప్టాను, 0.000009పాలు క్షేనాను నుండును. ఇవియన్నియు విలువగల మణిహేమాదులకంటె ప్రపంచముల కెన్నియో మాసుడుంగ లెక్కువవిలువ గలవనుట పీనిప్రత్యేక వివరణంబులఁ దెల్లంబుగాఁగలదు.

ఆ॥ ఆవియత్ప్రకృష్ట మావ్యాపకత్వంబు
లేకయున్నఁ జెంగలించి ప్రీలు
గోళచయము నంటుకొని కడుపరిమిత
వ్యాపకత్వ మమర నలరు నివియు॥ 228

క॥ ♦ ఉసికోడ నుద్భవిల్లుట
నుసికి న్దగుపల్చన స్వభావత్వాకృతుల
న్నసి గోళభ్రమణానుగ
మసియాట న్దిరుగుచుండు ననిలము లెపుడున్॥ 229

♦ ఉసి=Energy.

—♦ అగ్నితత్త్వప్రశంస ♦—

మ॥ చలినీరం బొకకొంతదాఁకఁ గలసీసా మూఁతి బంధించి సం
కులసంచాలన కొంతసే పొసఁగి మేకున్స్పికి శోధింప నా
జలమం దించుక వేఁడిజాడ లొనరొచందాన సత్వంబసం
కులనూత్నాణుపరిభ్రమక్రియల నగ్నుల్ లేఁగుట ల్చిత్రమే?॥ 230

ఉ॥ కాఁక కదుష్ణ ముష్ణము నఖండమహాగ్నియు జ్వాల లట్లు వ
లొప్పికలఁ బుట్టి వృద్ధిఁ గొని పూర్ణదశ న్నివమెత్త గోళస
ద్వ్యాకృతి నాక్రమించి బహుళార్థులఁ గూర్చుచు బైటియొరఁ దెం
పే కననీనిజ్వాలల వహించి రహించెఁ గ్రమక్రమంబుగన్॥ 231

క॥ ఈసంకులసంఘర్షణ
తో సంకరకార్య మెందుఁ దొడఁగ నవశత
న్యూనము కొని కలిసి కవగొనఁ
గాసాగె న్దరగతులఁ గణనిచయంబుల్॥ 232

మ॥ ఇటు లాగ్నేయసహాయవాయునియతిన్ హేవాక మాపీక సం
ఘటన లేకొనఁ గాలిగాలి కలియంగా గాలులేగాక ప్ర
స్ఫుటరూపాదుల నంబుభూకణసమాద్భూతు ల్వికాజిల్లె సం
తట సంతంత నిరంతరాంతరదభత్కారంబు ఘోరంబుగన్॥ 233

ఉ॥ ద్యావవతి జ్జనించినపదార్థకణాళి పరస్పరైక్యత

ల్పాన నవీనవాయుభవము ల్ద్రవము ల్ఘనవస్తుసంతతు
ల్తో నవతారమొందెఁ బ్రకృతు ల్గుణము ల్బహునూత్నవైఖరు
ల్గా నివి తొంటిమూలములకంటె విభిన్నములై చెలంగఁగన్॥ 234

ఉ॥ ఇట్టి యపూర్వసంఘటన లేర్పడఁ జేయుటె యగ్నికార్య మె
ప్పట్టున "సత్రకాయ"గఁ బ్రవర్తిలు దీనికి వస్తుభావమే
పుట్టదు శాక్తికాంశయనఁ బొల్చు నకైన నదృశ్యదృశ్యత
ల్నెట్టఁ బదార్థసృష్టి కధినేతృపథంబున ముట్టఁ జెప్పెడిన్॥ 235

క॥ కాఁకకు ధ్వనికి న్వెల్గున
కే కాకఁ వైద్యుతాప్తికిన్ మఱి బహుళ
త్వాకర్షణశక్తికి నిది
యేకద మూలంబు తనుత హేరాళతలన్॥ 236

చ॥ చలనముచే జనించియు భృశత్వము నాచలనంబునందు సం
ధిల నొనరించి యైక్యతల దీప్తులతోఁ బటుశబ్దభేదము
ల్గొలిపి నిరంతరం బఖిలగోళముల న్బహిరంతరుత్సవం
బులకు బునాదియై పొలుచుఁ బో యనలం బనిలానుకూలతన్॥ 237

క! చలనంబె లేని శైత్య
స్థలముల నిద్రాణుగతి (Latert) భృశంబుగ నలమన్
నిలచు వియత్తత్వంబు
న్నొబల మెంతటిదాఁక వెలయునో తద్వ్యాప్తిన్॥ 238

క॥ ఆనూటకు వచ్చినచో
నీమాదిరిఁ బంచభూతబృందాణువులన్
శ్రీమద్భగవత్తత్వము
లో మును నిద్రాణులై విలోలించెడివే॥ 239

—♦ ద్రవతత్వప్రశంస ♦—

గీ॥ బహువిధకణాతిఘర్షణ న్భగ్గుమనెడి
యగ్నితోఁ దోఁచె ద్రవసంచయంబు లందు
నుదజనికణద్వయంబుతో నొక్క ప్రాణ
వాయుకణ మంటుకొన జలంబాయె సృష్టి॥ 240

ఉ॥ తోఁచినతోడనే జలము, తుష్వరమో, చినుకొక్కొ, బొట్టొ, ధా
రాచయమో, ప్రవాహమొకొ, అంబుధియో, యని యెంచరాదు పె
ల్లేచెడియగ్ని నావిరిగనే తొలికాను వేళ పీఁగుచు

స్వేచ్ఛ చరించు నయ్యనలవేగము తగ్గ జలంబు లౌటకున్। 241

మ॥ ద్రవజాతుల్ క్రమయానామ్లలత్వదశల స్థాపించుకో నైనవీ
లవు సౌమ్యత్వము నొప్పు బహ్వనలవాత్యల్పాంను నావెంబడి
న్నువరల్చిన్నులు బొట్లు ధారలు ఘను ల్తో యంపు గాశిస్థితు
ల్మిపులంగాంచఁగడంగు వారిదము లై మిన్నంటి వర్షించుచున్॥ 242

క॥ ఆయావర్షాపాతము
లాయా గోళాగ్ని మతుల నావిరులై పై
నే యెగురుచుండు గోళము
పైయుంచు ఘనీభవించు పర్యంతంబున్॥ 243

ఉ॥ ఆవెనుక ద్రవంబు లొనరయ్యెడి నిమ్నపథాలఁ జేరు, నీ
శ్రోతద్రవాలు పెక్కులుగ దోఁచుటకున్ నమను మున్న యెన్నియో
తావుల ధాతుణీకణఘటల్ ఘనతల్ గని పేరి గోళము
న్లావ్రఁ గుదించుకొంచు బహుళంబుగ గోళముపైని నేర్పడున్॥ 244

చ॥ ఘనకణజాలము ల్వడిగఁ గాక ద్రవ్యజించి ఘనీభవించు నా
వెనుక ద్రవాలు నెమ్మదిగ వేంద్రము వీడు మఱింత యాలసిం
చు ననిలజాలి యుష్ణమును జోపఁగఁ నట్లయియుంట నేల పొ
ల్చినవయి దానియూతమునఁ జేకొని యెద్రవవాయుఘాతముల్॥ 245

ఉ॥ వస్తుకణంబు లాదిదశ వాయువులట్లు చెలంగి కొంత కా
విస్తృతిఁ గొన్ని మాని సరవి న్ద్రవరూపములయ్యె వానిలో
సిస్తుగఁ గొన్ని సాంద్రతలఁ జేకొన గోళమహాగ్ని వావిరిన్
మస్తు విడన్విడ న్బలుక్రమంబుల నింబు విడంబితంబుగన్॥ 246

♦ పృథ్వీతత్త్వ ప్రశంస ♦

ఉ॥ తొంబది రెండు మూలములతోఁ గొనసాగి వసర్గమందు సం
ఖ్యంబది రెండొ మూడొ తగ గాలులుగా, రసము ల్వెసన్ ద్రవం
బుంబను జేకొనన్ గొదువ మూలములన్నియుఁ బృథ్వితత్త్వ
వింబలుచోట్లఁ జేసుకొన వేఱుగ, గల్పుగఁ జెక్కు లేక ల్గలన్॥ 247

చ॥ తొలిజననం బెటున్నఁ దటికో బఱ తెంచెడి శీతు వగ్ని యే
కొలఁదియొ యాకొలంది సరకు ల్ర మసాంద్రత మార్పుఁ జెందుపో
కల ఘన మంబువొటయును గాలియునొటయు గాలియంబువై
యలఘనవస్తువొటయు నియంత్ర్యవిచిత్రచరిత్ర సూత్రమా॥ 248

సీ॥ ఇసటోపు లనుచును న్నెంచియుంటిమి వాని

నిచ్ఛాతిపాతలం చెఱుఁగవలయు.
భూతత్త్వవివరణంబున ముఖ్యముగ వీని
పుటుక యెట్లో? ఫలంబు నదియగునో?
కనుఁగొంట ధారుణీకాయస్వరూపసం
భవ మెఱుంగుటె యగు న్దానవలిగఁ
బుట్టి యాడెడిమూలములనుండి యిన్నాట
ముప్పదెన్మిదిగ నిమ్మకొన నివియు
నింక సమ్మేళనములచే నెల్లవస్తు
వితతి పుట్టఁగఁజేయఁగా వింతయైన
దింకొకటి నక్షత్రకాయగా నెసఁగు నంత
రాళమందు నయోన్యాఖ్యఁ బ్రౌఢి వెలయు॥ 249

గీ॥ తత్స్వరూపస్వభావవాస్తవము తొలుత
నరయవలయుట ముందు ముఖ్యముగుఁ గాన
వెనుకముం దించు కెంచనా వేడ్క తీఱ
శాఖశాచంక్రమణ మన్నదడి యెసఁగదు॥ 250

—♦ ఇసటోపుల (ఇచ్ఛాతిపాతల) స్వరూపస్వభావములు ♦—

ఉ॥ పాదరసంబు సోకి తనవన్నియ మాఱిన పైడి మూసలో
నూఁదఁగ నూఁదఁగా రసమెటో మటుమాయముగాఁగఁ బోయెడి
న్గాదె? యదేప్రకార మణుకాండము లాదిమహోగ్రచాలనో
త్పాదితశక్తి భిన్నతయు బల్పను గాంచుచునుండుఁ బల్మఱుఙ్॥ 251

ఆ॥ "పనసవేది కలదు వానిహస్తములోన"
ననెడిమాట లోకమందుఁ గలదు
పరుషవేధిపదము పలునోళ్ళఁ బడిపడి
పనసవేది నాఁగఁ బరిణమించె॥ 252

ఉ॥ తొంబదిరెండువస్తువులఁ దూకమున న్గ్రిమవృద్ధిఁ దాల్చు గ
ర్భంబున నున్న హేలలను బట్టి జలానిల మొక్కటించుమిం
చుంబరువే నురేవియము చూపును ముప్పదియెన్మిదింటితోఁ
బంబిన రెండునూర్లయినభారము నుద్యసమానమైననుఙ్॥ 253

చ॥ ఉపి తగినంతగాఁ గొలిపి యూఁదుటె కల్గిన వస్తురేణువం
దెసఁగెడి హేలల న్నడుమ నెప్పుడు నుండెడిగర్భమందు మా
ర్పు సతముఁ గల్గు హేలలనొ బొడ్డునునో మఱిరెంటనో తదు

ల్లసితములై పదార్థకణలక్షణము ల్తగమూర్చునొందెదుర॥ 254
ఉ॥ హేమకణంబునం దెసఁగు హేల లశీతికొకండులొచ్చుగా
నామెయిఁ బారదంబుకణమందు జెలంగు నశీతిహేలలే
దో మెలవూని మించుసెగ నూఁది రసంబుననొక్క హేలఁ బై
ల్రాపమఁగ జిమ్మఁ గల్గునెడఁ బ్రాప్తిలు హేమకణంబు సుల్వగ॥
గీ॥ చవుకలోహాల హేమంబు సలుపుకోరి
యెన్ని యొకతాబ్దములనుండి యెసఁగుచుంట
నెందఱో యెంతసొమ్ము వ్యయించి రుజర
బహురసాయనయోగసన్నాహగతుల॥ 256
క॥ నేఁటికినే నేమూలిక
కాటునవో రాగి మాఱు కనకంబుగన
న్నాటునుడి చాటఁబడు నా
చాటు బయటఁబడదు లేమి సన్నగిలంగ॥ 257
శా॥ యోగిశ్రేష్ఠుల కీవిధానము సువిద్యోతం బటం "బ్రేదికా
నీ గోప్యం"బనుచేమొ విచ్చలవిడి న్నేర్పింప రారాగను
త్యాగు ల్గానుదానఁ దత్కళయె లుప్తం బయ్యెఁగాఁబోలు వా
గ్యాగర్భంబున మాటమాత్రముగ సధ్యాహార్యమై దాఁగెనే॥ 258
చ॥ ప్రకృతియె నశ్వరం బనెడిభానమున న్మనువూర్వు లెప్పు డా
ప్రకృతిపదార్థశోధనము వైద్యపథాదులఁగాక వూనిరే?
వికలత దానసైన నదివీసముపీసము నేనిఁ బోల్చిరే?
అకట! సమస్త మెట్లు మన కద్భుతమై కనుపింప దీప్తిరే॥ 259
ఉ॥ ఉండినదైవ మంచొకరుఁ డుండఁగని,మ్మ! ప్రపంచ మెప్పు డి
ట్లుండిన నుండని మ్మిటుల నుండకపోయిన బోవనిమ్ము! నా
కొండికజీవయాత్ర నొనఁగూడఁగ నొనది యెట్టిజ్ఞానమే
న్పండువుగా గడింతు ననుపద్ధతి సద్గతిగాక దూష్యమే? ॥ 260
మ॥ ఒకచిత్రం బెదియేని, గంటఁబడ నోహో!" యంచు నగ్గించుమా
త్రకెకా కత్యుది యానుపూర్విఁ దమకు న్ప్రాప్తించునందాఁక ని
ద్రపను న్నీటికిఁ దిండికి న్జెడియు యత్నంబూని సాధించువా
రికెగా కల్గెడి లోకసంగ్రహపవిత్రీభూతకీర్తిప్రథల్॥ 261
ఉ॥ కర్మమునేతయే పరముగా మునుఁగ న్దగదన్నసూక్తిలో
మర్మముఁ దేటమాటలఁ బ్రమాదకురానివిధంబుగాఁగ నం

తర్మ్మము లెంతచెప్పినను "నశ్వర మీజగ"మన్న దానఁ జె
న్గాత్మనొ లేమినొక్కొ కయిగొరు కుతూహలమే స్వదేశజుల్॥ 262

చ॥ ఇఁకఁ బయిపెచ్చు పూర్వము రచించిన పెద్దలగొప్ప మాటి కె
న్నిక గుణియించుచు న్దమరు నేర్వరు తద్గతి నాచరింప నిం
కొక రిఁక హెచ్చొ సర్వ సహా హా! యిదియున్న మదీయు లెన్నియుం
డక చన రన్నతృప్తిఁ గడంగుదు రెప్పుడు స్వాత్మవంచనన్॥ 263

మ॥ అదిగో తద్వయనంబునందె చెలఁగు న్వ్యాఖ్యానముల్ వ్యష్టినా
త్రదిదృక్షు ల్వరు లా సమష్టి మనవార్ల శ్రేష్ఠు, లాయీవిభే
దదశావిష్కృతు లందునిం దెగవుఁ జెంద న్వృద్ధి యొక్కింటి నొం
డు దెస న్నిల్పనెసంగె శాస్త్రపరమాణుప్రౌఢసంసిద్ధులన్॥ 264

ఉ॥ యుక్తుల నూహల న్నొసరుచుండు నవాఙ్మతిగోచరాఢ్యు న
వ్యక్తుని తత్త్వ మొండు మినహా భువనంబు పయి న్స్వభావత
న్వ్యక్తము లైన తత్త్వముల ప్రౌఢసుసూక్ష్మదశావిశేషము
ల్ప్రక్తిఁ బరీక్ష జేసి వివరంబులఁ దెల్పెద రన్యదేశజుల్॥ 265

మ॥ తెలివి న్బట్టునెడ న్ప్రసిద్ధులె పరాధీనత్వవిభ్రాంతి సం
ధిలునాఁ డాదిగ నిత్యసంకటముల న్దిక్కేదుట న్నేమి నా
కులపాటుపని కెత్తనీయుమిఁ బురాగోష్ఠు ల్గిగన్గ్రావి ర
ట్టులగాదే స్మనవారు శాస్త్రపరిపాటు ల్వద్దిల న్జేయరే॥ 266

చ॥ తనికను నేఁ డొకింతగ స్వతంత్రము మానవు లేము మాదిమై
న నొక ప్రబుద్ధరాజ్య మని నల్గడఁ జెప్పుకొనంగ నైన శో
ధవలకుఁ బూని పెన్నిలుపు నక్కత కు ప్రయతించు సూక్ష్మబు
ద్ధి నెగడు నస్మదీయులను దీనిని నూచిగఁ గాంచ నెంచెదన్॥ 267

చ॥ ఒకకణము న్వ్యవస్థ యెటులుండునొ స్థూలముగాఁగఁ గంటి మో
పిక నిఁకఁ దద్విశేషకథ విస్తృతిఁ బోల్పు నెసుమ్ము మించనూఁ
దుకృషి యెట్లు దూరావనుగఁ దోఁచునొ పైపైనటొపు లెట్టులె
ట్లు కలుగవచ్చునో మఱల లోన నయో నెటుకల్గు నర్థమా॥ 268

మ॥ కణగర్భంబును జొట్టి యొక్కటి మొదల్గా నేకవృద్ధి న్జెలం
గును హేల ల్పరివుష్టి ద్వ్యావసతిగా గుర్తింపనైయుంచుఁ గ
న్గొనసయ్యెన్గద! యీపరిభ్రమణ పంక్తుల్కట్టునో? యొక్కటా
టునవే సాగునొ? చూడగావలదె యాకూఢి ప్రబంధానంబుగన్॥ 269

క॥ తొలివస్తువుదజనికణ
మలరు నటన్ హేల యొండె యందున నేచి
క్కల కవకాశం బింతయుఁ
గలుగదు తక్కినవి చూడఁగాఁ దగువరుసన్॥ 270

క॥ మనధరను జంద్రుఁడోరీ
తిని చుట్టి చరించుఁ దద్విధి హ్వేల యొకం
డును దిరుగుచుండునుదజని
కణగర్భముఁ జుట్టి యెల్లకాలము వడిగన్॥ 271

గీ॥ రెంటినుండియుఁ దొంబదిరెంటివఱకుఁ
బ్రథమపరిధిని రెండుగా వఱలు హేల
లందు రెండవ హీలియమందు మఱొక
పరిధికిని లేవు హేలలు పఱుఁగులిడఁగ॥ 273

క॥ మూఁడిట వేఱొక్కపరిధి
నాడు నొక్క హేల నాల్గునన్ రెం డగునీ
జాడ ద్రెండవపరిధి
న్వాడు రెండె చివఱవరకు బరిశీలింపన్॥ 274

క* దిగువన్ లిఖియించినపట
మగుపఱచున్ వివరణముల నది గమనింపం
దగుఁ బ్రతివస్తుకణమునం
దగుహేలాపరిధు లచట నవగాహనమా॥ 275

* పాత్రము చివరఁజూచునది.

గీ॥ గర్భముంజుట్టి యేడుప్రాకారములుగ
వెలసి హేలాగతు ల్మఱి వీనిలోనఁ
గలవు చినచిన్నసాలముల్గాఁగ హేల
పోఁబడు ల్పట్టికను జూడఁ బోల్ప నగును॥ 275

ఆ॥ గర్భమునకు దాఁపుగా నున్నసాలాన
నొక్కశ్రేణిహేల లొప్పి తిరుగు
రెంట మూఁడు, మూఁట నేను, నాల్గిట నేడు
నైది బైదె యారి బైదు వెలయు॥ 276

క॥ ఈయంత్రశ్రేణులలోఁ
బాయకొకటినుండి యమరుఁ బదమూఁడనుకన్

దోయంబులుఁ దోయంబులుఁ
ద్రోయక హేల ల్నిసర్గధోరణు లెసఁగన్॥ 277

క॥ తుది షట్పదార్థకణమునఁ
బొదలు న్పత్తమవు శ్రేణిపోలిక హేల
ల్కుదిరికగ దిరుగుచుండుట
లదిరా! తద్గర్భములకు నా పేడ్కోటల్॥ 278

మ॥ పరదుర్భేద్యబహుత్వర ల్నిగుడ గర్భం బీవిధిం జుట్టి సు
స్థిరసంచారము సల్ప హేలలను దత్తేమాధ్వము న్మార్ప సం
కర మొందింపఁగ నొక్క హేలనయిన న్దాటింప వేర్సేయ దు
ర్భరకార్యంబగు సాగనేనిఁ బ్రళయప్రారంభతుల్యం బగున్॥ 279

క॥ హేలావసవ్యవిద్యు
ల్లీలకు సరి సవ్యశక్తి లేవు న్గర్భం
బాలక్ష్యము చెడఁగా నొక
హేల న్దాటింప గర్భ మేలా సైచున్?॥ 280

గీ॥ గర్భనిర్భేదనమున నావిర్భవించు
ప్రళయభయదఘోరాగ్ని ప్రపంచ మఖిల
నాశన కరం బగు నెన్న నాగసాకి
కణవిభేదకబాంబున మఁగిపోదె॥ 281

ఆ॥ అయిన నిందు మెలవు నంటిపట్టినఁ గొన్ని
వస్తుకణపు గర్భ పాటవములఁ
జెల్పవచ్చు గాని జెందకే శోధనా
గారముల బహుప్రకారగతుల॥ 282

మ॥ కణగర్భంబుఁ బ్రదక్షిణించుకొను చుగ్రప్రౌఢవేగాన దాఁ
వున దవ్వాదును బాగ్లుగా వెలయుగుంపున్హేలల న్నేగ్పుపాం
దున విద్యుత్ప్రబలప్రసారముల నందున్గొల్ప నాయాయుసిన్
జొనుప న్వేర్పడఁజేయ శక్యమగుచుండున్ గ్రాంతిమద్దేలల న్॥ 288

ఆ॥ హేలదూఱి కలిసెనే నట్టికణ మవ
సవ్యవైద్యుతమున జాణయగుమ
తలఁగ సవ్యవైద్యుతము ప్రౌఢత న్దాల్చె
దాన రెండు నివి యఱెూను లగును॥ 284

క॥ శాలామోనిగ మొదటిది

యాకాశయోనిగను రెండవది గుర్తిడనా.
ఖ్యాతంబులు గాను నావ
స్వాతత్వైఖరుల మార్పునందమినైనన్ ॥ 285

గీ॥ కాని విద్యుత్ప్రసార సంఘర్షణమున
గర్భగతసవ్యవిద్యుత్ప్రకాండమందు
గూడ మార్పాయె కలిగినతోడ వస్తు
తత్వమేమాఱు టొకట సాధ్యమగుచుండు॥ 286

గీ॥ పాదరసకణగర్భసవ్యప్రసార
కము లెనుబదంట నొకటిపోఁ గనకమగును
ఒకటి చేరిన దాలియు మొదవు నిట్టి
విధి పరుష వేధ నాఁ బూర్వవేత్త లనిరి॥ 287

గీ॥ పరుష మగులోహమందు నీవరుస మార్పుఁ
గొలుపఁగలదానినే తొల్లి పిలిచియుండ్రు
పరుష వేధి యటంచును ప్రాజ్ఞవరులు
దీని నొరులండ్రు పరసవేదిగఁ గ్రమాన॥ 288

క॥ నూతనసూక్ష్మాణుబహు
వ్రాతముతో మించనూఁదు, రాయిడిలో నా
నూతనము జిక్కుకొను గణ
పాతంబయి వస్తుగుణవిపర్యయమిడకే॥ 289

క॥ ఉదజనికణగర్భంబున
కదికిననూతనముచేత నంతకుభారం
బెదుగుటయె యణువు పెరుగుటె
కుదురున్ వస్తుగతి యింతకు న్మొదమునా!॥ 290

క॥ ప్రతివస్తువునకు నిట్లే
జతపడగల బదులుసృష్టిఁ జాల్గొనువారిన్
నుతియింత్రిసటోపుల్గా
మతిమంతులు శాస్త్రసూక్తిమహ్యాపలలిన్॥ 291

వ॥ ఇట్టి విస్ఫోటముప్పదేన్మిదిగాఁ బ్రథమసూక్ష్మకణప్రచండచలనజని
తాగ్నివలననే కలిగెనని తెల్పఁబడినది. తొంబదిరెండుగా నమరిన
వస్తుసంఘటమున దేని కెన్ని యాకారములు కలిగెననుట నీక్రింది

పట్టిక తెలుపఁగలదు. ♦ 292

♦ పొత్తము చివరఁజూచునది.

క॥ గాలులు కీలలు నీళులు
నేలలు చాలుపుల గలుగు నెఱవుల నోలి
న్మూలపదార్థంబులు నుప
మూలపదార్థములు నిట్లు మూర్తులుగొనఁగన్॥ 293

—♦ శక్తి ప్రశంస ♦—

మ॥ ప్రకృతిద్వంద్వము సంప్రతించుకొని సర్వంబందు నూరేగుచూ
క్ష్మకణంబు లక్షణము ల్పరిశాంతములుగాఁగ న్నిల్వఁగా నూత్నమూ
త్నకళాకాంతుల వస్తుసంభవము ప్రాప్తంబౌట యున్నేకి యటం
చౌకనిర్ధారణఁ గామరూపయగు నేదో యూఁది రుచ్చాటనన్॥ 294

ఉ॥ అదియే శక్తియటన్న పేరున జగద్వ్యాపారసన్నాహము
వద పెంపొందఁగ 1నాను 2టంటుటయు 3సంబంధించుట 4ల్పంగమిం
పు 5దు వాళింపుఁ6గుదింపుఁ7బర్వుఁ8బ్రసరింపు9న్లాగుట10ల్త్రో)యుట
ల్మొదలౌ నన్నిటి కన్నిరూపములఁ దెంపు న్నింపు గుంపించెడిన్॥ 295

1. Adhesion, 2. Cohesion, 3. Miximg, 4. Combining, 5. expansion, 6. Contraction, 7. Motion, 8) Circuting, 9. Attraction, 10) Repulsion.

సీ॥ గోడ కొత్తిన వెన్న యూఁడకుండుటఁ జూడ
నానుడుశక్తి యుం చఁగఁబోలు
నీటికణా ల్విడుపాటు గాకుంటయే
యుంటుశక్తిగఁ బోల్చుకొంటఁ బోలు
నీరుఁ బాలుం జేరుసారెన్న సంబంధ
శక్తి చూపెడి విలాస మనఁబోలు
నుదజని ప్రాణవాయువు రెమ్మ నీరౌట
సంగమశక్తియనంగఁ బోలు
నీ రనిలమౌట ననిలంబు నీరమౌట
పొంకుఁ గుదియింపు నాగఁ బల్కంగఁ బోలు
రాల్చుటయె లాగు డనఁబోలఁ గ్రమత నిటులు
శక్తి వివిధవిహారప్రశస్తి వెలసె॥ 296

క॥ వేఁడెత్తుట వెలుఁ గీనుట
చూడుట మండుటయును స్ఫ్రుచోదన మంతః

త్పాదనము పొడుకొను బ
హోద్వదయముల కొడుకొనిరో యుజ్జ్వలఫణితిన్ ॥ 312

గీ॥ అట్టిగురుసౌఖ్యదాయుఁడు తర్పనీయుఁ
డతిత రాద్భుతమహుఁడు ప్రత్యక్షదైవ
మైనమనసూర్యభగవాను నానుపాను
తెలియఁగుట సముచితమె యంతో యింతో కొంత ॥ 313

గీ॥ దుర్నిరీక్ష్య తేజస్సముద్రుం డినుండు
కాని పొగచూరుసద్దంబుఁ గనులకేసపి
కనినఁ బసపెర్పుముద్ద చక్రముగఁదోఁచు
రంగుతాచిన బిళ్ళయనంగ నింగి ॥ 314

క॥ నక్షత్రశాల కరిగి వ
రీక్షింపఁగఁ గొన్నికొన్ని రేనిఁ దదంత
ర్నిక్షేపంబులుఁ దద్గత
విక్షేపంబులు నెఱుంగవీలగులీలన్ ॥ 315

ఆ॥ కిరణభేదియంత్రకీలితంబుగ మేటి
దుర్భిణిన్ గసంగఁ దొరకునింకఁ
గొన్నికొన్ని యందు గుప్తంబులుగనున్న
బహువిశేషములు స్వభావకళలు ॥ 316

క॥ కల దుజ్జయిని న్నమ పౌర
విలసన్నక్షత్రశాల; వెలసెఁ బిదపఁబ
లోకాలదుల నటనట; నన్నిట
విలసన్పర్వతగతంబు విఖ్యాతమిలన్ ॥ 317

క॥ తత్తత్పరీక్షల న్నము
పాత్రములగుచిత్రముల యుపాసనములలో
ను త్తీర్ణులయిన శోధక
సత్తము తెరిఁగింత్రు సవితృసందర్శితముల్ ॥ 318

గీ॥ ఏడువేలలోమ్మిదినూర్లయిరువదియగు
మైళ్ళ వ్యాసము గలభూమిమాద్రి గోళ
చయము వేయైనచో బృహస్పతికి సమము
వేయిగురు లెంతో రవి యంతవిరివిగలఁడు ॥ 319

క॥ టన్నులలో రవిభారము

లానని సర్వము రోదసి
లోన విలీనంబుగాఁగ లోపించుఁగదా!॥ 327

క॥ అనిలోచుట కేసఁదియు
మానుతే దాభయము స్వర్థమునుగా దయినన్
గనిగా రోదసి నుదజని
యనవరతము వెలయఁ బ్రళయమాఁగఁగవచ్చున్॥ 328

క॥ ద్వానవతిపదార్థములన్
దానే మొదలొట నినుని తనువునఁ గలస
ర్వానకు నిదియేమాలము
గా ననుకోనఁ గొంతపీలు కల్గుటవలనన్॥ 329

క॥ ప్రళయాగ్ని మహాఘూనన
కళ గోళాంతరములందు గణవిచ్ఛేదం
బులు గలుగునప్పు డుదజని
వెలువెరలును బతుదు మిం బహుళ గ్రహములన్॥ 330

క॥ ఒహుసూర్యగోళములు స
స్వహానంబుల వెడలు నిది ఘనంబగుననిచే
విహరించుచు నెందే న
న్వహామొనరవిఁ జేయుచుండు వాల్లభ్యమునన్॥ 331

క॥ పోవునది పోవుచుండగఁ
నానైపున మఱలఁ జేరునది చేరంగన్
లా వెపుడు మాఱకొండం
గావచ్చునుగా పరవుల కాయములందున్॥ 332

క॥ ఇగియుం గల దవలార్భటిఁ
బ్రిదులుటయుంగలదు కొన్ని వేళల నీయా
వదలో! కర్మముచాలని
యుదనున నాయారవిన్ హాలాభు నొవర్చున్॥ 333

క॥ లేకున్న నల్లచుక్కల
కేకారణ? మెన్నొ మింట నెసఁగెడిఁగాదే!
యీకంజమిత్రుఁ డైనన్
జేకొనఁదగుఁ గాల మటు ముసించినవేళన్॥ 334

గీ॥ అట్టిప్రళయంబు దరిసెనం చదలఁజనదు

కోట్లతరబడి వత్సరా ల్కొంతు నవల
గాని యదిసంభవింప దకాలనియతి
దెలియ నెదచేయిపిడి పోయి మెలఁగవమ్మ॥ 335

సీ॥ మనవత్సరం బొక్కదినము దేవతలకు,
నట్టివి మున్నూటయఱువదైనఁ
దద్వత్సరంబు ద్వాదశసహస్రము లివి
యరిగనే నొక్కమహాయుగంబు
నివి యెబ్బదియునొండు నేని మన్వంతరం
బగుఁ, బదునాల్గు మన్వంతరంబు
లొక్కబ్రహ్మహమా నక్కడికో సమా
ప్తంబగు నుదయకల్పంబు పిదప
నంతపొడవున క్షయకల్ప మగుచు బ్రహ్మ
రాత్రినడచు, సృష్టిప్రపచము మవల
మూడుసంవలయుగపది కూడ సజాని
కొక్కవత్సర మగుమొదు నిక్కమరయ॥ 336

గీ॥ బ్రహ్మ బ్రహ్మాబ్దములు నూరుబ్రదికి, ప్రళయ
మొందు నొక్కబ్రహ్మ కాలూఁదుకొనఁగ
నిట్టి బ్రహ్మకల్పం బొక్కటేని విష్ణు
నాయువ్వున నొక్కమాసమ్మె యలుపుచుండు॥ 337

క॥ పన్నెండు విష్ణుమాసము
లెన్నఁగ విష్ణ్వబ్దమౌ నివే నూరగుచు
జ్జన్న విష్ణుప్రళయము
తన్నన్, మఱియొండట న్మొద లొకనుచుండున్॥ 338

క॥ ఈవిష్ణుకల్ప మొకదిన
మ్మై పత్రిలు రుద్రునకుఁ దదబ్దశతంబేన్
బోవు నితం డికనొకఁడౌ
తావునుగనఁ గాలగతి నతర్క్యనిరూఢిన్॥ 339

క॥ ఈరూద్రిరుద్రకల్పము
యామంబె మహేశ్వరునకు నతనిశతాబ్దాల్
ప్రామిన ప్రళయము నొందున్
ధీమంతులు దీనికొలఁదిఁ దెలియనలయున్॥ 340

న్నంతన్జూచిన బింబమున్గానల హెచ్చుందగ్గు లెన్నన్నియో
గంతుల్లేగఁగ, లేదురా! సరళరేఖత్వంబునా నేర్పడున్॥ 848

క॥ గరుదాల్పుమేనివలెఁ బలు
గఱుకులు గలవనుగోళ్లుకైవడి మిట్ట
ల్లఱుగులయునాసబోగడన
హరిదేహం బూలుబంతియన విలసిల్లున్॥ 849

మ॥ రవిగర్భస్థలి పిడి వెల్పలికిఁ జేరన్జేర నుష్ణోగ్రవై
భవ మంతంతకుఁ దగ్గుచుంట తెలియున్ భాస్వంతు దేహం బెదో
ద్రవమో లేకఘనంబో యైన సమత్వనాడిల్లునే కాని యి
ట్లవునే కావున సూర్యగోళ మదియెల్ల న్వాయుసత్త్వాకమా॥ 850

క॥ దానవదీప్తిన్ వెలితల
మూనదు గర్భమున వంతెయుండుటన్ భూమిన్
బూనెడి వాతావరణము
గా నట వరితశ్ప్రసారిగా నదికలదో!॥ 851

గీ॥ మూఁక నెల్లరుఁ గాగడా లూవి కొండ
నెక్కి వో దవ్వునుంచి సమీక్షఁ జూడ
వెల్గు చీఁకట్లు గీరలై వెలయుభాతి
రవియుపరిభాగ మొప్పుఁ బరంపరాభ॥ 852

గీ॥ సూర్యగోళధ్రువంబులచుట్టుకంటె
యుబ్బునడిసీమ నివి పెక్కులుండు వీని
నిమువు నల్బదివేలమ న్వేషలుపైదు
వేలమైళ్ళకు గూడ గుప్పించుచుండు॥ 853

గీ॥ విరివి నటనట నెనుబదివేల మైళ్ళ
నిడివి లేచునీమంటలుం, వమువువరుగు
గంట కిన్నూరువేలమైళ్ళంట కలదు
చిత్రతరనాట్యభంగిమ ల్చెలఁగఁ బొలిగ॥ 854

క॥ రవిగోళోపరితల మీ
నపుకులఁ గన నద్భుతమ్మొసంగ, వెలయుచో
నవుపదుఁ దఱుచుగ నెడనెడ
వివరములన మచ్చ లెన్నొ వివిధాయతులన్॥ 855

ఆ॥ చందమామ మచ్చ చక్కఁగాఁ గనఁబడు

క॥ నెరముల కేఁశరువిరసుని
తెరఁగుగఁ బుండులని నెమకి దిగు నీఁగవలెన్
ఖరకరు రుచిరత లెన్నక
చటిమచ్చల నెన్ను టెటిసరసం బనినన్॥ 364

మ॥ రవిగోళప్రళయాగ్నిపూత్కృతుల సంప్రాప్తించునుప్పొంగచే
నవుచుండు న్భువిఁ బ్రాతికూల్యము తదీయాకర్షకోరుక్రియా
ద్యపథానంబుల, నూదియుంటులస్వభావం బార్తినొందున్, చరిం
పవు విద్యుత్ప్రసరాలు, యంత్రగతిసంబంధంబు తాత్కాలికున్॥

ఉ॥ ఉత్తరదక్షిణాధ్రువథరోపరివాయుపథాల ప్రేలుచున్
గుత్తగఁ జిత్రవర్ణముల గొల్పుచు జాఱులా వెలుంగుఁబె
న్మొత్తము లచ్చుమచ్చల వియుక్తములా కణపుంజములున్నవిగా!
తత్తపనీయవైద్యుతసుతాడిత కాంతికణంబులేసుమీ!॥ 366

గీ॥ పదునొకండేండ్ల కొకసారి వఱలుమచ్చ
లనుటకు స్దుర్భిణులసాక్ష్య మట్టులుండఁ
కలదు వేఱొక్క గట్టితార్కాణ, మచ్చ
లొనరుసాలున వేసఁగి యొుంగుఁజలువ॥ 367

ఉ॥ వేసఁగి మిక్కుటంబయిన వేఁడిని గుప్పక సార్ద్రసౌమ్యమై
భాసిల భూజవృద్ధికొకపర్వముఁ గూరుచుఁగాన దానిలో
నాసమయాల లావుపార లాముకొను న్జమి బోదె మున్నటన్
వాసిలువాని మించి తెలుప ద్దగి చెట్టువయున్న నూటిగన్॥ 368

గీ॥ బోదె నడ్డకోఁతఁ బొందింప గీరలై
వఱలు పొరలు వలయవలయములుగఁ
గ్రమతఁబడునొకంటఁ గ్రాలు మందపుపొర
మచ్చ లిచ్చువృద్ధి హెచ్చరింప॥ 369

క॥ ఈమచ్చల నవధానము
తో మఱిమఱి కనఁగ మనకుఁ దోఁచు క్రమమెదో
ప్రామఁగ బింబపునంచున
కై మునుకుప జరుగుచుండు గతి దినదినమున్॥ 370

గీ॥ భాను భ్రమణంబెసూ దీనిపట్టుగట్టు
పదియునాల్గుదినా ల్కనపడెడిమచ్చ
పదియునాల్గుదినా ల్కనపడకమఱల

దోఁచుటనె భ్రాంతికాలంబు దొరికె మనకు|| 871
క|| తనచుట్టు తాను భానుఁడు
కొనుఁ దిరుగఁగ నిర్వ్యదేనుఁ గొంచెమొగుపగా
దినములు నడిపట్టెన మఱి
తనధ్రువముల నిర్వ్యదేశు దాట భ్రమియున్|| 872
గీ|| కిరణభేదియంత్రపరిణీతదూరద
ర్శనిని రవికరంబు జొనుపునెడల
గ్రహణపటమునందుఁ గనిపించు రంగులే
డ్వరుస మారకుండుసరణిఁ గోడ|| 873
గీ|| ఎఱుపురంగు నారింజపండునువన్నె
పసుపుపచ్చన ప్రభ యాకుపచ్చనయును
మబ్బుకళరీతియును నీలిమందుచాయ
పిదపనూదాపసందుఁ గన్పించు వరుస|| 874
క|| ఈయారంగులనడుమన్
ఛాయల సమ్మేళనము కొసంగుటఁ గలువు
న్నోయములై పలురకములు
ఛాయలుగా వెలయు నింద్రచాపానుకృతిన్|| 875
గీ|| గాజుకణికపయిన్ సూర్యకాంతిపడిన
యవలఁ బెక్కుకళల్ ప్రవాహాంతరముల
వెలయు నాయాయియునికిచేఁ దెలియవచ్చు
నట్టివస్తువు సూర్యునం దెసఁగుననుట|| 876
గీ|| కిరణభేదియంత్రంబున గీలుకొలుప
మందుప్రతివస్తువయు పటమండలమున
నైజదీప్తిఁ ప్రత్యేకమౌస్థలాన
ప్రసరణముఁ జేయు గుర్తించువాలు నిడుచు|| 877
క|| హీలియ మనువిలువగలుగు
గాలి రవిగ్రహమునందుఁ గలదనుకొనఁగా
పీ తెసఁగె నిట్టిశోధన
గాలించుటనేసుమీ యఖండప్రజ్ఞల్|| 878
క|| రవిగోళపంచు పెకనున
కు వెలాప్పను సకలదిశలను న్నదిలక్షు

ల్మివిలెడిటన్నులవేడిమి
కవగా వెలుఁగెల్ల యెడలఁ గడలు కొనంగన్॥ 379

గీ॥ ఇందులో మనభూమికిఁ జెంను రెండు
వేలలక్షలవంతైన వేఁడి, వెల్గు
మాత్రమే తక్కినది విడుమఱియ లేక
వృథగ విశ్వాంతరాళాన వెడలు నిటకో॥ 380

క॥ ఇంతటికొంచెంబున నే
న్నంత తఱిగనేని మంచునో కధికంబై
యంతంతఁ బేఱి ధ్రువభూ
ప్రాంతమునా న్మంచుగడ్డ వలె భూమియగున్॥ 381

చ॥ కనుఁగొన వృక్షజాతి కలికంబునకైనను దోఁచకుండు, డిం
దును క్రిమికీటకాదులు. పొనుంగుపడున్ ఖగసృష్టి వేసశిం
చును మృగసంచయంబులు, మనుష్యులకు న్మనుమార్గముండ దెం
దును వడకల్లుకొండలఁ బ్రతున్నమగు న్ధర సారహీనమై॥ 382

సీ॥ అల్లనల్లనఁ బిల్లిపిల్లిగింతల నెల్ల
యెల్లల మొల్లమై యుల్లసిల్లఁ
దెమ్మెరగాఁ బూవుఁదెమ్మె లిమ్ముగఁజిమ్మి
కమ్మనియెమ్మె పైఁ గ్రుమ్మరింప
గాడుపై యాడాడ గూడులో గోడుల
న్దోఁడి విజ్జోడుగా పీడవాడ
గడుసుపెన్పుములఁ బడరుచు న్గడలుల
న్పడమిపై కొడియు నాగడముఁదొడుగ
ప్రాణము న్ప్రాణమై జీవదానమాన
గానతావమానంబుల సోన లీన
గాలి యేలీల మేలైన వాలునేలు
వేఁడివేలుపు చేదోడు వెలయకున్న॥ 383

సీ॥ కనులుండియు న్గాంచననువుండనీక
కార్చిఁకటి యేకడ న్ప్రాకకున్న
తనువుండనేని జేతనముండనీక జీ
వద్రవ్య మెంను లోఁబడకయున్న
స్థితులుండియు న్వ్యాప్తవితతి దండుగ గాఁగ

మించుమంచెం దాక్రమింపకున్న
దెసలఁ జండియు నొబ్బల్చప్రవసతి బొందుగ ధరా
భ్రమణచంక్రమణము ల్సమయకున్న
స్థలశిఖానిఃజలవిభేదములు లేక
ప్రళయమలినాకులత నొందు నిలువకున్న
కాలగణనప్రకారంబు గూలకున్న
వేఁడివేలుపు చేదోడు వెలయకున్న॥ 384

॥ అటులని యొక్కసూర్యునివిహారమె యేర్పడియుండెనేనియు
త్కటదహనోగ్రతావమునఁ గ్రాఁగుచు నల్లులపోల్కి మాడిపో
వుట నిజ మన్నిజీవములు భూజములు న్సకలంబు లట్టిసం
కటము ఘటిల్లకుండఁ ద్రిజగత్పతి కూరిచెఁ గొన్ని మేలులన్॥ 385

సీ॥ ఎపు డొక్క పెడ సూర్యు నెనుఋకుండఁగ ధరా
భ్రమణచంక్రమణాళిఁ బాదుకొల్పె,
వేఁడికరా లున్నటి గాడక వంగ వా
తావరణంబొకం డమరఁజేసెఁ
తొడగినయుశుకు నెంగోత్పార స్జల్గార్ప,
జుట్టు వారిధులను బట్టుపఱిచె,
ప్రళయోష్ణ మొకటఁ జేఁగనీయక విదుర్ప
సంచలద్వాయుప్రసార మొనఁగె,
మించివచ్చిన దొమ్మిదిమేఘములను
ప్రక్కకాపుగ వేంచేయ భద్రపఱిచె
నన్నిటికి మిన్నగా నమృతాంశుఁడైన
చందమామను యామికాస్థ న్గుదిర్చె॥ 386

మ॥ రవి క్షీరోదధినుండి చింది విడిగా రంజిల్లునాఁ, డంబరం
పువిహారంబున నేగ్రహానుసరణంబు ల్లేక తానొంటిగా
నివిడన్ గోళము నేఁటియూర్వునకు నెంతేమిన్నగాఁ బల్వన్
మివుల్లై యాత్మప్రదక్షిణభ్రమణము ల్మిన్నిట్లుగా సాఁగగన్॥ 387

క॥ ఇనుఁ డొకపరిఁ దనుఁ దాపలఁ
గానఁబడకొండొండ్లఁ దీసికొను; నొకభ్రమణం
బున సెనున కిఱునూరై
లైనయువడి న్గూర్పునిర్వదేన్గోట్లుండ్లన్॥ 388

ఉ॥ ఎన్ని యుగంబు లాతఁ డదియేపనిగా గిఱిగెంటులాడెనో
యెన్నఁగలేము గాని, యిదియేపస నిందొచరించు మన్నయా
చున్నతిఁగన్న భానుఁ డెవఁడో దరియు న్దరియుంగ వానిసం
పన్న బలాతికర్షణముపాల్పడు నీమనభానుమేరుసన్॥ 389

మ॥ ఒకచో నుబ్బు జనించి పొగయయి యెంతో సాగి యాయింతలో
ప్రకటాకృతిం డెడమై చనన్ దునుకలై బైలందు గోళంబులై
ప్రకృతిప్రాప్తిఁ బ్రదక్షిణభ్రమణముల్ప్రాప్తింప నెప్పట్లఁ గొం
చక తండ్రి న్మనసూర్యునిన్ వలఁగొన న్సాగె న్వధాశక్తిగన్॥ 390

ఉ॥ సాగినజంపున న్గొనల సన్నన సక్రమవృద్ధి మధ్యమా
భాగమునందుఁ బెల్లుబ్బు బాఱి యొసంగుట ప్రీలినవ్వాడా
యాగరిమన్ వహించె నచటచ్చటి తుంపు లవేగ్రహంబులై
ద్యోగతి నంతరాంతరపథోవనతిన్ రవిఁ జుట్టుఁ గొల్చెడిన్

క॥ మొదలెన్న తుంపుకో నెలి
యను, నేఁటి కెఱుంగఁబడినయవి లెక్కింపన్
బదకొండు తక్కరంపుకొ
ంచములన్ బ్రత్యేకచర్యల నివాసిల్లున్॥ 392

—♦ బుధగ్రహము ♦—

క॥ అన్నిటఁ జిన్నది రవి దరి
నున్నదియు బుధగ్రహంబె యుజ్జ్వలదీప్తి
న్గన్ను లపండువ నొసఁగున్
మిన్నునఁ గనపైనతఱుల మిఱుమిట్లిడుమన్॥ 393

క॥ తనచుట్టు ప్రవిచుట్టు
న్జను నెనుబదియెన్మిదౌదినంబులలోనన్
దనగోళమున నొకసగం
బు నె యెప్పుడు రవికి మొనపి పొర్లుచుఁబోవున్ 394

గీ॥ గుడుసుగాక కోడిగ్రుడ్డునాకృతి దీని
భ్రమణచక్రముంటనలన రెండు
నూర్లనవతి నాల్గునూర్లముప్పదిలక్ష
లందుమైళ్ళు మాఱ నరుగఁజొట్టు॥ 395

గీ॥ మిగులదాపైనతఱులఁ దొమ్మిదిగ రెట్లు
దవ్వుగా న్నాల్గురెట్లుగాఁ దనరుచుండు

భూనిదాఘోష్ణవృన్గోలం బోల్చిచూడ
రవికెదురు వర్థగోళాంతరంపువేఁడి॥ 396

గీ॥ ఇంత వేఁడికి దగు వెల్గు నెసఁగుకతన
వచటిస్థితిగతు లన్నిటి యానుపాను
తెలుఁకగావు సమగ్రత నెట్టిదూర
దర్శనికినైన నెట్టివిమర్శకైన॥ 397

క॥ ఇరువదితొమ్మిదిమైళ్ళగఁ
బరుగిడు సెకనునకు; దాని భ్రమణపుద్రోవన్
ధర కొక్క రేఖగా నే
యరయఁగనగు బింబమెల్లనగుపడకుండున్॥ 398

క॥ ఒకసామున నత్యుష్ణము
నొకట నివము నిరుఁవ నెప్పుడుండుట జీవ
ప్రకర మటకలుగదననొ
నీఁక సాంధ్యావనులనుండునేమో కొలఁదిన్॥ 400

క॥ ప్రాణానిలముం బొలయువ
కానఁబడదు మిగుల బొగ్గుగాలి పొలిగ జా
నో, పత్రజనియు నావిరి
యో నెసఁగుమనుంతు దాన యెవ్విశేషరయున్॥ 401

క॥ మహభూభ్రమణపుఁ ద్రోవకు
నినునకు నీగ్రహమ్ముత్రోవ యెసఁగు నడుమ నం
దునఁ గ్రహణం బవుడప్పుడు
కనబడు, నిది బుధునిదాఁటుగా నంద్రు బుధుల్॥ 402

గీ॥ ఒకశతాబ్దిఁ ద్రయోదశ మొప్పు దాట్లు
గోళము లు వెంతయో యెఱుం గుటకు కాదు
చలితతికి వేసఁగికి వారము లోకయారి
యగుట ఋతువులు వడివడి నందు మాఱు॥ 403

వ॥ దీనిం జుట్టియుండు వాతావరణముం గూడ మిగులవల్చనయగుటవలన వెల్గుచీఁకటిగలగోళార్ధముల సంధిప్రదేశముననైన జీవములుండ వీలు లేదనిపించును, జ్యోతిర్మానదండమున దీనిసంఖ్య (రవినుండియెడము) 0.39K నిర్ధారణమైనది. బోధసంఖ్య 0.4 404

గీ॥ ఆమనిన్ రవిగ్రుంకు ననంతరమునఁ

జలితర్జీ బ్రొద్దుపొద్దుముంగలగ నొక్క-
గంటమాత్రమె నీబుధగ్రహము మనకు
గోచరంబగు, శ్రద్ధతోఁ జూచు నెడల॥ 405

—♦ శుక్రగ్రహము ♦—

గీ॥ మనకు బుధునకు నడిమితెన్నున భ్రమించు
నీతఁ డిన్నూటయేఁబదియేన్దినముల
కొక్కపరి జుట్టిచ్చుచునుండు రవిని
దాఁటు మూన్నాళ్ళ నాత్మప్రదక్షిణంబు॥ 406

క॥ ఈగోళము దాదాపుగ
భూగోళసమాన మిరుసు పొడవు మైళ్ళలో
దోఁగును డెబ్బదియేడ్నూ
ర్లై గోళార్థంబొకండె యుత్తరదెసఁగొనున్॥ 407

గీ॥ రెండవసగానఁ జీకటి నిండు నెపుడు
బుధునివలెనే శతాబ్దికి మూర్తికూడ
దాటుఁ రెండు మార్లినుఁ జాటువఱచి
రేఖగా నీతఁడుం గోచరించు మనకు॥ 408

క॥ కొన్నాళ్ళు తూర్పున న్మతి
కొన్నాళులు పశ్చిమమున గోచరుఁడగుచున్
బన్నని వజ్రపుకణికగఁ
గన్నుల కామితముఁగూర్చుఁ గావ్యుఁడుమింటన్॥ 409

గీ॥ ప్రాణవాయు వీగోళానఁ గానరాదు
బొగ్గుగాలియె యెక్కుడై పొదలుచుండు
జీవములుగాని వృక్షాలచిన్నగాని
కిరణభేది చూపింప దొక్కరవయైన॥ 410

క॥ వాతావరణపుసాంద్రత
చేతన్ ముకురంబుబోల్కి చిచ్చుదొర కళా
రీతులను బ్రతిఫలించెను
చేతన్ గడు నిండుకాంతి చే నిది మెఱయున్॥ 411

వ॥ జ్యోతిర్మానదండాన దీనిసంఖ్య 0.73 బోడులెక్కను 0.7 412

క॥ మనచందమామవలెనే
కనఁబఱచున్ క్షయమును వృద్ధిఁ గావ్యుడు బుధుఁడున్

గీ॥ అతిసమీపంబునకు వచ్చినట్టితఱుల
దూరదర్శిని శోధించి సూరివరులు
కుజునిగోళము మట్టంటుకొనుచునుండు
గాలి మనుజ గిలఁ గలదానిఁ బోలు ననిరి॥ 421

క॥ మనభూగోళపుచిక్కన
కెనగా కసగంబుగాని యొసఁగుఁగుజాండం
బునసాంద్రతయనిపల్కిరి
కనిరటనటరంగురంగుగాళ్ళున్ జుక్కల్॥ 422

ఉ॥ చుక్కలఁ బైరుపట్టులనుచున్ బహుశాద్వలభూములంచుఁ, జా
ళ్లక్కడి నీటికాల్వలని యర్థముఁ జెప్పిరి కొందఱద్రులం
దెక్కడఁగానరావట మహీధ్రువసీమల కంతయింతయో
తక్కువనుండు నాధ్రువపథంబులలో వడగండ్ల పేరుకుల్॥ 423

ఉ॥ వేసఁగినీహిమాద్రులొక వింతగఁ బూర్తిగ కరఁగ నిండుగా
భాసిలునంట కాలువల, వారి, యవారిగ; వానిక్రిందనే
దోసిలిదజ్ఞమల్పిగులు యోగ్యములు, భూప్రజకంటె నేర్పులు
న్యాసులు మీఱుచుండిరట నీశాసుగనల్పదుసంట సేద్యమున్॥ 424

ఆ॥ మఱల శీతకాల మతిదేలగ్రమముగా
హిమశిలాళి ధ్రువమహీంద్రమునఁ
జేటిపేటి యవలి వేసఁగి సాగున
కనువుపడుచునుండు నటకరంబు॥ 425

క॥ నారింజపండు వన్నియ
శోరంబుగఁ బెక్కుచోట్లఁ దోఁచు నెడారుల్
మీఱునట నీటియావిరి
యూరయుజీవములు మనుటకాధారముగన్॥ 426

వ॥ ఈ కుజగోళము జ్యోతిర్మానదండాన రవినుండి 2.77 యోడములఁ గలదు. దీనికి డైమసుఁడు, ఫోబసుఁడు ననుపేర్లతో రెండుపగ్రహములున్నవి. డైమసునియిరుసు పదిమైళ్లపొడవు. ఫోబసునిది 86 మైళ్లు కుజగోళానకు దగ్గఱగనున్న ఫోబసు 7½ గంటలలో నొకభ్రమణమును బూర్తిచేయును. ఇతఁడు పడమట నుదయించి 5 గంటలలో నస్తమించును. డైమసుఁడో తూర్పున నుదయించి రెండురోజు లవతల పడమట నస్తమించును. వీరిభ్రమణములొకరికొక రెదురు మళ్ళగ

నేర్పడెను. బోడునట్టిక చే నీకుజునకు 2.8 సంఖ్య లభించినది. కుజ శబ్దమునకు × జయని విడదీసి కు=భూమికి, జ=పుట్టినదియని చెప్పుదు నీ గ్రహమొకనాఁడు భూమిలో నుండెడిదేనని యనువారందురు. సూర్యునుండి లేచినపెద్ద ప్రీలుటలో మొదటనివి రెండుఁ గలిసి యుండి పిదప విడఁబడియుండును. 427

## —♦ విచ్ఛిన్నగ్రహము ♦—

క॥ రవి నెగసినకొప్పున వి
ట్టవిసిన శకలముల నైదవదియై వరుసన్
రవిబుధకవిభూకుజాలకు
ను వెలిన్ బెరుగోళ మపుడు నూల్కొని చెలఁగెన్॥ 428

ఉరువున నెంతగా వెలసెనో యది మండలు లాటి ప్రీలెనో
కర మెటుము న్న చిల్లినో; యొకాయకి సీవలసూర్యుఁ డావలన్
గురుఁడునులాఁగఁగా నిలువఁగూడక. పోయెనో, యింకనే మవాం
తరవిలయావాతి నైతెనో తథ్య మెఱుంగఁగ లేము నేఁటికిన్॥ 429

నలుబదినాల్గువేలుగఁ దునాతునుకల్పడె నీగ్రహంబనన్
గలయిక మున్న నాఁడు గురుకాయముతో సరిదూఁగఁబోలు. నా
వలఁగొనుమార్గము గ్రనికిఁ బర్వెడి నిర్వదియారుమార్గల
క్షలయిన మైళ్లలోనఁ దునకల్ బహుళంబులు చిన్న వేసుమీ॥ 430

సీ॥ ఇరువు వింశతిమైళ్ళుగా హెచ్చుఁ డలను
నల్ప దేడై త్రి యిరుసుతో నడచు సీరుఁ
డీ గ్రహాల్లెండె పెద్దవి యిన్నిటికిని
దక్కినన్నియు లోహంపుతునక లెఱుఁగ॥ 431

క॥ హేరుఁడు గోర్డలితలనల
మీఱుచు దన శ్రేణిలో భ్రమించుచు మిగుల
జైనవగ పచ్చుఁ బుడమికి
నారయు నటుఁ గల్గుతునక లన్నిటిలోనన్॥ 432

గీ॥ కడు నెడంబుగ నుండుమక్కలకు నడుమ
నెంతపాటిమారం బనియెఱుఁగుకొఱకు
గైకొనంబడు మేల్పథకంబునందు
హేరుఁడే మరల నుపయోగభూమి॥ 533

## —♦ గురుగ్రహము ♦—

క॥ ఈతునకల కవ్వలిదివి
నాతతకాయంబుతోడ నన్నిట మొనగాఁ
డై తిరుగుగురుఁ డనంబడు
పోతుంగా మొకటి వేయిభూములకొలదై॥ 434

గీ॥ ఎనుబదెన్మిదివేలమైళ్ల గ్రహంపు
టిరుసుపొడ; వర్తనకు దీని యెడము నాల్గు
నెన్మిదియుమూడునున్నయు నిడినసంఖ్యఁ
దేలు లక్షలమైళ్ళుగాఁ దెలియఁబడియె॥ 435

చ॥ రవి కొకమాఱు ప్రదక్షిణతరా నిది కైకొను ద్వాదశాబ్దముల్;
ధ్రువముల రెంట నుబ్బునస తోపక బల్లగఁ దగ్గియుండు హే
తువ లరయన్ ఘనీకృతి యెదోకొరతంబడియుంటె కాక యెం
తో విసురుగా సుడించు వడితోఁ దనచుట్టు భ్రమించుచేసుమీ!॥

క॥ ఇరువదినాలుగుగంటలు
ధర కొను నొకసారిఁ దిరుగఁ దనచుట్టవురా!
గురుఁడో పదిగంటలకు
న్దఱుగొను వేయిరెట్లతనువు గలిగియున్॥ 437

వ॥ ఈగోళపువడి వేఁడివట్టి తనచుట్టుఁ దొమ్మిదిగంటలయేబదినిముసముల ముప్పదిసెకనులలో నొకసారి సుడియుచుండ దీనికీవలాలిపట్టె లింత కంటె నైదునిముషముల 10 సెకనులెక్కువ యైకొనును. 438

క॥ రవి భువి కీడునుష్ణములో
మివ్వలతరుగ గురుని సంక్రమించుచునున్నన్
తవ్వులఁబడు టెంక నారమి
నవుపడు పెనుదీప్తితోడ నాకాశమునన్॥ 439

క॥ భూగోళములో సరిగా
నాగోళము గట్టిబడక యావిరి యనిలో
ద్యోగంబును బొందుగలుగఁ
గా గడుసరికాక వల్చగానేయుండున్॥ 440

వ॥ ఈగ్రహమునకు దొమ్మిదియుపగ్రహములుకలవు. ఇందుఁ దూఁపుగ నున్నది యన్నిటం జిన్నది. తక్కువాతినాల్గురుం బెద్దవి. వీనిలో రెండవదానియడ్డకొలత 8560 మైళ్ళుపొడవైయుంటచే నురువున మన

చంద్రుని మించియున్నది. గురుగ్రహంబున జీవములుంట కవకాశ మంతగఁ గనుపింపకున్నను వీనిలో నొకదాని నుండియుండ నవకాశము లగుపడియెడి. వీని వెలుపలగ మఱియొక్క నాలుగుపగ్రహములు దవ్వుదవ్వులం బ్రదక్షిణించుచుండును. కడపటిదిమాత్ర మెదురుదిశలో దిరుగుచుంటచే నిది బయటినుంచి యాకర్షితమైన దేమో యని యనిపించును. జ్యోతిర్మానదండాన రవి కిది 5.20 యెడమునున్నది. బోడుసంఖ్య 5.2 ఈగురుగోళమున నొకయద్భుతము కలదు. దీని కంటుకొని యున్నట్లు కనుపించు ముప్పదివేలమైళ్ళ పొడవుతో నేడువేలమైళ్ళ వెడల్పుతో నాత్మప్రదక్షిణము తొమ్మిది గంటలయేబదియైదు నిముసముల ముప్పదేడు సెకనులలో నొకమాఱు పూర్తిచేసికొనుచు యెఱుపురంగుతో గురునిమధ్యరేఖకు దక్షిణపు వేడిపట్టిలో చంచాచిప్పయాకృతితో నొక తునుక యున్నది. కొలందికాలమున నిది బాగుగ నెడపడి మఱియొక యుపగ్రహమగు సూచనలున్నవి.

క॥ గురుగోళము మందమునై
పరుసన్ బట్టెలఁగ మూఁగు వారిదములలో
నిరతముఁ గప్పఁబడుట సీ
ల్వాతలదు గోళోపరిస్వభావ మెఱుంగన్ ॥ 442

చ॥ ఉరవున వేయిరెట్లుధర కున్నను దానికి దగ్గ బర్వులో
వఱలదు సూ గురుగ్రహము; భాస్కరుఁ డా వలయంబులో వసుం
ధర కొకవేళ దాపుకవిసన్ మఱియొక్కటఁ జాలదవ్వుగన్
దఱచిన ముప్పదెన్మిదికోటులలక్షలునైదు దాసినన్ ॥ 443

గీ॥ ఎడమఁ చనుమిది నెనుబదియేడునూర్ల
మాప్పదులలక్షలకు మైళ్ళగాప్పసంఖ్య
వఱలు బుతు పన్నెండికిఁ గొని సంవత్సరములు
మనకయిన కాలమానాన మలయుచుండు ॥ 444

## శనిగ్రహము

ఉ॥ ఊరవిచిత్రమంతసు నధీశ్వరుఁ డప్పుడుగాఁగ నున్నవన్
సారమునందు నిండువఁ బ్రకాస్తిఁ గళ న్విడి పెద్దయౌచుఁ దా
మీఱుటఁ జేసి సార్థకత మించ గురుండు ప్రధానమంత్రియై
తీరువు నేరుపోవు పనులన్నఁ సౌమ్యతఁ జేవఁదీర్చెడిన్ ॥ 445

క॥ ఇనునుండి యితని వెలిదెస
నెనుబదియెనిమిదగునూర్ల కోట నరువదిగాఁ
బనుపదులక్షలమైళ్లం
గనుపడు గ్రహమొందు చిత్రకాయాద్భుతమై॥ 446

గీ॥ బింబమో! డెబ్బదియు మూడు వేలమైళ్ళ
యడ్డుకొలతుండు, రవిజుట్టి యురుగుదేఱ
నిరువదియు దొమ్మిదిన్నరయేండ్లు పట్టు
నిందుచేత శనైశ్చరుఁ డితఁ డయ్యె॥ 447

క॥ గురున ట్లీగ్రహము ఘనీ
కరణా వెనుబడినయట్లు కనుపించుఁ దను
స్ఫురణము వాయుద్రవసం
భరితమె యనఁ బొల్చు లోహపటిమ కొఱవడా॥ 448

క॥ మును గనఁగొనఁబడిన గ్రహా
ళి నితం డంత్యాంబరస్థలిం దగువాఁడై
యును నితరగ్రహములకం
టెను మెల్లగ జుట్టసీసడిఁ గడియించెఁ॥ 449

క॥ ఈతనిగోళము చుట్టుం
బాతరలాడెడిని వెల్గుపట్టెలు మూఁడ
త్యాతతము లగు పెడల్పుల
నాతీ ప్రత్యేక మీగ్రహం బొక్కటికే॥ 450

గీ॥ ఘనత తక్కువనురవడి క్రందుకొనఁగ
పూర్తి నాత్మప్రదక్షిణంబుగను, నింత
బలుపు గోళంబుగూడ గంట లొకపదియుఁ
నైనిబది పేనునిమిషాలలోన నొకట॥ 451

క॥ దట్టము లగు మబ్బులచేఁ
జుట్టంబడి యెవ్వరంటఁ జూడఁగరావి
గట్టున నైసర్గికకళ
లెట్టివో తజ్జీవనిసర మెట్టిదియో॥ 452

చ॥ తొలుత శనిగ్రహంబు గుఱుతుం గనుపెద్దల కిద్దిగోళ మీ
వెలుపటివల్ల పట్టి లనిపింపక సర్వమునుం గ్రహంపు చి
త్రలసితదేహమే యనువిధంబుగఁ దోఁచె మహాద్భుతంపుహో

కీ లలర, దూరదర్శినిని గాంచ బయల్పడెఁ దద్విశేషముల్ ॥ 453

క॥ తిరిగెడి చక్రపుకుండ కె
దురుగా నిలుచున్న నేమితో నాకులు వ్రా
ల్పొఱవుల వ్రాటి ల్సర్వము
పరయందగియుంట తెల్లమగు విషయమొకా ॥ 454

క॥ తొలితావు వదలి క్రమముఁగ
నలనేమికి సూటికరుగ నంతంతకుగా
ల్వాలయము మారుచు నవయవ
ముల మాటెడి నేమియొకటి పొడనూవుగదా ॥ 455

క॥ నడిగోళము వెలిపట్టెలు
గడు నెడు రగుపోక నున్న కాలమున గనం
బడుపట్టెలు విశదముఁతొ
వెడలుపులక్ జూడఁజూడ వింత వెలుఁగులక్ ॥ 456

క॥ రవిచుట్టుఁ బ్రదక్షిణక్
దివికిడిచో నెదురుటున్కి తీఱుఁ గ్రమముగాఁ,
జివరకుఁ బట్టెలనేమికిఁ
దవుసూటి న్బడఁ వెడల్పు తా గిటుముగుక్ ॥ 457

ఉ॥ బింబమునందు గీటుపస వీక్షితమై క్రమతక్ వొలంగుచుక్
బింబముచుట్టుఁ బట్టెఁగ విస్తృతినందియు వెండి గీటును
నిక్కంబడు మధ్యకాలము గణించుటనే భ్రమనొకవూ ర్తికా
లంబున సాము దక్షిజనులక్ సుఖనిశ్చయ మాట యొప్పదేక్ ॥ 458

మ॥ వెలుఁగుంబట్టెలుగా గనంబడెడి యీవింత న్గనుక్ దుర్బిణిక్
దిలకింపక్ విడిచుక్కచాల్పులఁగఁ గన్పించుక్; శనిం జుట్టిరాఁ
గల యేపెద్దతుపగ్రహంబో మనొ ముక్కలెన్నొక్కలై వేఁనం
ఖ్యలుగా నాభ్రమణాఖ్యమందె చనుటల్గా దోఁచు నువ్వాయులై ॥

చ॥ ఒకటియొ ప్రీలి ముత్తెగలవ్యూహములయ్యెనో! లేక మూడటుల్
శకలములై స్వకాక్ష్యములఁ జాల్గొనెనో! యిపు డెన్నలేముగా
ని కమలమిత్రుఁజుట్టి గమనించెడి ప్రీలినగాము తున్కలో
క్క కదుపె యామ ప్రేణులనుగట్టిమి శంకకుఁ దావొసంగెడిక్ ॥

క॥ పట్టెల వెలువలియుంచులఁ
దటెడి నడికొలత లక్షతగనేడ్పదుల

